# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక





చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (సంవత్సరం) | 45.00 |

చందా పంపవలసిన చిరునామా

విస్డమ్

[illegible]

మద్రాసు-600004


# ఈ సంచికలో

డిసెంబరు 1985



★

ముఖచిత్రం

పిల్లితో జీనస్

తెలుగు విస్డమ్‌కు ఇది నాలవ సంవత్సరం

## ధ్యానం

### ఆచరణవల్ల సౌశీల్యం తెలిసి వస్తుంది



జేమ్స్ ఎలెన్

ఒక యోగ్యమైన కుటుంబంలో పెద్దలు తమ పసిపిల్లలకు మొట్ట మొదట వినయ విధేయతలు నేర్పుతారు. ఏ పరిస్థితిలోనైనా సరే పిల్లలు వినయ విధేయతలను విధాయకంగా అనుస రించే విధానాలను అవబోధన చేస్తారు. వీటిని ఎందుకు అనుసరించాలి అనే విషయం చెప్పరు. పోగా వీటిని అనుస రించి నడుచుకోడం తప్పనిసరి అని నిర్బంధ పెడతారు. చేసి తీరాలని ఆజ్ఞ పెడతారు. తండ్రి అనిపించుకునే వ్యక్తి ప్రప్రథమంగా తమ పిల్లలకు అనుసరణ యోగ్యమైన ధర్మాన్ని,

(మిగతా 5 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### అచ్చుతప్పులు, పొరపాట్లు

సాధారణంగా నుపిపురుగు కొటాకుల పుస్తకాలు, కాగితాల పుస్తకాలు, అచ్చు పుస్తకాలు తొలుస్తాయి ఇవి అక్షరాకారాలుగా కనిపిస్తాయి. వాస్తవంగా అక్షరాకారంగా తొలిచే ఉద్దేశం లేకున్నా ఆ తొలిచిన భాగం అక్షర రూపంగా కనబడేటట్లు చేసిన ఒక పని తలవని తలంపుగా మరో అనిర్దిష్ట కార్యంగా పరిణమిస్తుంది. వీటిని చూసి కొంతమంది పరిశోధకులు కావ్యాలకు పాఠాంతరాలు, పాఠభేదాలు కల్పిస్తారు. ఇదే ఘుణాక్షర న్యాయం.

ఇలాగే గ్రంథాలు, పేపర్లు, పత్రికలు అచ్చులు కూర్చి అచ్చు వేసేటప్పుడు మనం ఎంత జాగ్రత వహించినా మాట్లాడేటప్పుడు నోరుజారినట్టే కొన్ని తప్పులు, పొరపాట్లు దొర్లుతాయి. మాటలలో అక్షరాలు తారు మారు అవుతాయి. మాటలు కలిసిపోతాయి. అసలు మనం చదువుకునే విషయాలు కాదు వాటికి ఏర్పడే అనర్థాలు చాలా హాస్యాస్పదంగా కన్పిస్తాయి. వీటిని ముద్రారాక్షసా లంటారు.

ప్రూఫ్‌లు దిద్దడంలో ఎంత జాగ్రత్త వహించినా అనుకోని తప్పులు, పొరపాట్లు ఏర్పడటం సహజం. ఒక వార్తాపత్రికలో

"అయినవారికి ఆకులలోను కానివారికి కంచాలలోను."

ప్రచురింపబడ్డ కొన్ని ఇంటి సలహాలను చదివి ఇంట్లో చేసిచూద్దామని ఒక ఆమె ప్రారంభించింది. 'రగ్గుమీద కొత్తగాపడిన



మానెజిడ్డు మరకలు పోగొట్టడానికి మానె పడినచోట ఒక అద్దుడు కాగితం (Blotting paper) పెట్టి, ఐరన్‌తో ఒత్తిపెట్టాలి. మానెపడిన ప్రదేశాన్ని మెగ్నీషియంతో కప్పాలి. ఇలాగే ఇరవై నాలుగేళ్ళ పాటు ఉంచి తరువాత బ్రష్‌తో తుడవాలి' అని ప్రకటనలో ఉంది. ఇక్కడి ముద్రారాక్షసం- ఇరవై నాలుగు గంటలు బదులు ఇరవై నాలుగు ఏళ్ళు అని ప్రచురించడం.

ఒక ఫొటోగ్రాఫిక్ పోటీకి సంబంధించిన ప్రకటనను ఒక పత్రిక ఈ విధంగా ప్రకటించింది. మాటల పొందిక లేకపోవడంచేత ఎంత హాస్యాస్పదంగా ఉందో చూడండి. 'పోటీ నిబంధనల ప్రకారం 10 అంగుళాల పొడవు 8 అంగుళాల వెడల్పుగల వ్యక్తి స్నాప్ షాటులై ఉండాలి.' ఇంతకంటే వింతగా కనిపిస్తాయి ఈ క్రింది ప్రకటనలు. "పోయినది - పందిలా ఉండే బాలుడి చిన్న హుండీపెట్టె" "దొరికింది - ఉక్కురిబ్బులు గల ఒక మహిళకు గొడుగు." "పోయింది- పూర్తిగా సిరాతో నింపిన వ్యక్తికి పెన్ను". "అమ్మడానికి - బుల్‌డాగ్, ఏదైనా తింటుంది. పిల్లలంటే ఎంతో ఇష్టం."

ఇక నోటీసుల విషయం చూడండి. "నన్ను అభినందనలతో కార్డులతో, ఉత్తరాలతో జ్ఞాపకం పెట్టుకుంటున్న వారందరికీ ధన్యవాదాలు చెప్పాలనుకుంటున్నాను. నేను ఇంకా డాక్టరు కారు (Car) క్రిందే ఉన్నాను.

(మిగతా 6 వ పేజీలో)

# దీర్ఘకాలం జీవించాలంటే?

జగత్ ఎస్. బ్రైట్

జీవితపు సాంకేతిక విలువలను పూర్తిగా అవగాహన చేసుకుని జిజ్ఞాసాపూర్ణ్యంతో, కృతనిశ్చయంతో వాటిని అవలంబించి



నప్పుడు మానవుడు దీర్ఘకాలమే కాదు, అనంతకాలం జీవించగలడు అని విజ్ఞాన శాస్త్రం, ఆధ్యాత్మిక విజ్ఞానం ఏకాభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నాయి. ఇదే ప్రాచీన సుప్రసిద్ధ భగవాన్ మహావీరుని యొక్క, ఆధునిక సుప్రసిద్ధ ఆంగ్లేయ రచయిత బెర్నార్డ్‌షా అభిప్రాయం కూడా. కొంతమంది యోగ సాధనలు చేసి ఈ నిర్ణయానికి వచ్చారు. మరి కొంతమంది జీవశాస్త్రాధ్యయనం వల్ల దీన్ని నిర్ణయించగలిగారు.

యౌవనాభివృద్ధితో దీర్ఘకాలం జీవించడానికి ప్రాణాయామం, హఠయోగం అభ్యాసం చేయాలి. లేకపోతే వైజ్ఞానిక రంగంలోను, వైద్యరంగంలోను నూతన పరిశోధనా ఫలితాలను వినియోగవంతం చేసుకోవాలి. అమెరికాలో కోటీశ్వరులు కొంతమంది తిరిగి ముందు ఒకప్పుడు ప్రాణప్రతిష్ఠ కాగలదనే అభిప్రాయంతో తమ కళేబరాలను శీతలీకరణం చేయించుకుంటారు.

'మానవుడు మరణించి తీరాలనేది ప్రకృతి విధానం కాదు' అని బెర్నార్డ్‌షా 'బ్యాక్ టు మెథ్యూసెల్లా'లో చెప్పాడు. మరణం అనే భావాన్ని మీ అంతరాత్మ నుంచి తొలగించినప్పుడు 969 సంవత్సరాలు జీవించినట్లు చెప్పబడుతున్న మెథ్యూసెల్లాలా మీరూ జీవించగలుగుతారు.

## విజ్డమ్ పాతకాపీలు

ఫిబ్రవరి '83, మార్చి '83; ఫిబ్రవరి '84 నుంచీ డిసెంబరు '84; జనవరి '85 నుంచీ మే '85 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీల వెల రూ. 1.75 లు, 1984 కాపీల వెల రూ. 13.00 లు; 1985 కాపీల వెల రూ. 6.25 లు. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 2.75 చేర్చి M. O. పంపాలి. 'విజ్డమ్' 9, దేశికారోడ్డు, మద్రాసు-600 004.

—పబ్లికేషన్ మేనేజర్.

"ఊరి మీద ఊరు పడినా కరణం మీద కాసు పడదు."

చాలాకాలం జీవించడానికి సన్న్యాసం ఒక మార్గం. భారతీయ సంస్కృతిలో సన్న్యాసిని జీవచ్ఛవం క్రింద లెక్కగడతారు. ఇల్లు, సంసారం వదలిపెడతాడు. 'నేను', 'నాది' అనే సంకుచితభావాలు నశించిపోతాయి. మానసికంగా ఒక 'నవజన్మ'ను పొంది లౌకికమైన ఒత్తిడులు, మానసికమైన బిగువులేకుండా నిశ్చింతగా ఉంటాడు. నేడు లౌకిక సంబంధమైన ఒత్తిడులు మానసిక బిగువులే మానవుల మరణానికి ముఖ్య కారణాలు.

ఆర్థర్ క్లార్క్ అనే సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు 2100 A. D. కి మానవుడు అమరత్వాన్ని సాధించగలడని అంటున్నాడు. 1967 వ సం॥లో ఆగస్టస్ కిన్సెల్ మనం వృద్ధాప్యాన్ని పూర్తిగా పోగొట్టుకోగలమని, ఇకమీదట మానవునికి ప్రమాదాలవల్లే మరణం ఏర్పడుతుందని వివరించాడు. కాని ప్రాథమిక ఆధ్యాత్మిక గణితం ప్రకారం మన పాపకార్యాల వల్లే ప్రమాదాలు ఏర్పడుతున్నాయి. ఆధ్యాత్మిక నిబంధనలను కఠినంగా అనుసరించినప్పుడు మీరు. మీ బంధువర్గానికి ఎవ్వరికీ ప్రమాదమే సంభవించదు.

'కాన్‌క్వెస్ట్ ఆఫ్ డెత్' (Conquest of Death) అనే గ్రంథాన్ని రచించిన డా॥ ఆల్విన్ సిల్‌వెర్‌స్టీన్ మానవునికి ముఖ్యంగా మారక హేతువులైన క్యాన్సర్, గుండె జబ్బు, మధుమేహం, ప్రమాదాలు అనేవి 2000 A. D. నాటికి పూర్తిగా నశించిపోతాయని గంటాపథంగా చెబుతున్నారు. మీరు ఒక దశాబ్దంపాటు జీవించగలిగితే తొలి అమరజీవుల వంశానికి చెందినవారు మీరవగలరు అని ఆల్విన్ స్థిరీకరిస్తున్నాడు.

లండన్ యూనివర్సిటీ కాలేజి హాస్పిటల్‌లో ప్రాణులమీద వాతావరణ ప్రభావాన్ని పరిశోధిస్తున్న డా॥ డేవిడ్ డావీస్ ప్రపంచంలో వివిధ ప్రదేశాలలో దీర్ఘకాలం జీవుల జీవన విధానాలను అధ్యయనం చేసి ఇక కేవలం 5 సంవత్సరాల అత్యల్ప కాలంలోనే మారణ నిరోధకమాత్రను ప్రవేశపెట్టగలను అని అంటున్నాడు.

విల్కాబాబా (దక్షిణ అమెరికా) లోయ ప్రాంతంలో నివసించే 100 సంవత్సరాల వృద్ధులు ఉన్నారు. వారింకా కాయ కష్టాలకు ఓర్చి పనులు నెరవేరుస్తున్నారు. ఈ పవిత్రమైన లోయలోని జలంలో ఇనుము, సున్నం, క్రోమియం సమృద్ధిగా ఉన్నాయని అంటారు. ఇక్కడి జనం పుష్కలంగా తాజా కాయగూరలు. జొన్నలు, తింటారు.

మంచి హృదయం పవిత్రతతో ఖులాసాగా పాడుకుంటూ దీర్ఘకాలం జీవించండి. ●

---

(2 వ పేజీ తరువాయి)

సమాజ మర్యాదను అలవాటు చేయడానికి పూనుకున్న తరువాతగాని నీతి నియమాలను బోధించడానికి ప్రారంభించడు. సౌశీల్యం, మంచి నడవడి. ధర్మం అనేవి ఆచరణ వల్లే తెలిసివస్తాయి. వీటిని ఆచరించినప్పుడు సత్యం అవగతమవుతుంది. పరిపూర్ణమైన ధర్మాన్ని, సౌశీల్యాన్ని తెలుసుకున్నప్పుడు పరిపూర్ణమైన సత్యం ప్రతీ వ్యక్తిలోను దానంతట అదే ప్రకాశిస్తుంది. ●

"నెమ్మది బరికించి వివేకమ్మున దెలియంగ వలయు గల్లయు నిజమున్."

# మరాథాన్ పందెం పుట్టుక

పర్షియా దేశపు చక్రవర్తి దేరియస్ (Darius) బి. సి. 490 సెప్టెంబరులో



గ్రీసు దేశపు ఏథెన్స్ మీదికి దాడి చేయడానికి తన సైన్యాన్ని పంపాడు. ఈ సైన్యం ఏథెన్స్‌కు కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న మరాథాన్‌లో దిగింది. కొన్ని రోజుల తరువాత ఎథేనియనులు, పర్షియనులు ప్రసిద్ధి నొందిన మరాథాన్ యుద్ధంలో పరస్పరం సంఘర్షణకు పూనుకున్నారు. దేరియస్ చక్రవర్తి సైన్యం పెద్దదిగా ఉన్నా పర్షియన్ సైన్యాన్ని ఎథేనియనులు ఓడించారు. ఈ విజయవార్తను కుతూహలంతో ఉన్న ఏథెన్స్ ప్రజలకు తెలియజేయమని ఎథేనియన్ సైన్యాధికారి పెయిడిప్పిడిస్ (Pheidippides) అనే సైనికోద్యోగిని పురమాయించాడు.

పెయిడిప్పిడిస్ మరాథాన్ నుంచి ఏథెన్స్‌కి - 22 మైళ్ళ 1,470 గజాల దూరం - అతి తక్కువ కాలంలో పరుగెత్తి వెళ్ళాడు. అసలే యుద్ధరంగంలో బాగా అలసిపోయి ఉన్న పెయిడిప్పిడిస్ ఈ శ్రమకు తట్టుకోలేకపోయాడు. విజయం విజయం అని కేకలు వేస్తూ ఏథెన్స్ మార్కెట్ ప్రదేశంలోపడి మరణించాడు.

పెయిడిప్పిడిస్ జ్ఞాపకార్థం ఎథేనియనులు వరసగా కొన్ని ఆటలు ఏర్పరచారు వీటిలో పరుగెత్తడం కూడా ఒక క్రీడగా నియమించారు. 1896 వ సం॥లో ఏథెన్స్‌లో ఒలింపిక్ క్రీడలు పునరుద్ధరించబడ్డాయి. అప్పుడు మరాథాన్ అనే రోడ్డు పందాన్ని క్రమబద్ధం చేసారు. ●

---

(3 వ పేజీ తరువాయి)

దయతో నా కోసం ప్రార్థించండి." ఇక్కడ care అని ప్రచురించడానికి బదులు car అని ప్రచురించారు. పెద్దపెద్ద వక్తలు మాట్లాడేటప్పుడు పొరపాట్లు దొర్లుతాయి. అమెరికాలో ఒకసారి రేడియోలో మరణవార్తలకు సంతాప సంగీతాన్ని ప్రసారంచేసి "గత 24 గంటలలో ఎటువంటి మరణాలు సంభవించలేదని తెలియజేయడానికి తీవ్ర సంతాపాన్ని తెలియజేస్తున్నాము" అని చెప్పారు.

వ్రాతలలో పొరపాట్లుగాని, ప్రసంగాలలో పొరపాట్లుగాని ఒక్కొక్కప్పుడు చాలా విపరీతంగా పరిణమిస్తాయి.

---

"మించిన పనులకు నేరము లెంచం బనిలేదు."

# అవీ-ఇవీ

**భారతదేశపు మొట్టమొదటి గాలిపటాల మ్యూజియం:**

భారత దేశంలో మొట్టమొదటిదే అని చెప్ప దగిన అపూర్వ గాలిపటాల మ్యూజియం



అహమ్మదాబాద్ (గుజరాత్)లో భాను షా అనే స్థానిక కళాభిమాని ఏర్పాటు చేసాడు. ఇతడు దేశంలో వివిధ ప్రదేశాలనుంచి గత 20 సంవత్సరాల నుంచి 1300 రకరకాల గాలిపటాలను సేకరించాడు.

* * *

**కావలూరు దూరదర్శిని:**

తమిళనాడులో కావలూరు నక్షత్రశాల (observatory) లో ఏర్పాటు చేయబడిన దూరదర్శిని ఆసియాలోనే మిక్కిలి పెద్దది. ఇప్పుడు భారతదేశంలో ఉంటూన్న దూరదర్శినుల చీలికల (aperture) కంటే దీని చీలిక చాలా పెద్దదవటం చేత ఎక్కువ వైశాల్యం చూడవచ్చు. దూరంలో ఉండే మిణుకు మిణుకుమనే ఖగోళ రాశులుకూడా ఈ దూరదర్శినిలో అతి స్పష్టంగా కనిపిస్తాయి

* * *

# మీరైతే...?

(అక్టోబరు 1985)

(మన దేవుళ్ళందరూ విదేశాలలో బ్రాంచీలు తెరిస్తే?...)

"విదేశాలకు వెళ్ళి దేవుని ప్రసాదాలలో మేకులు ఉన్నాయో లేదో చూస్తాను"

—పి. ఎస్. చారి, విశాఖపట్టణం.

* * *

"స్వామీ! స్వయంగా చూశారుగా ఇకనైనా స్టార్ వార్స్‌ను ఆపండి అని ప్రార్థిస్తాను"

—ఎమ్. రాజశేఖరరావు, అనంతపూర్.

* * *

"దేవుళ్ళకి కూడా విదేశీ మోజు పెరిగిందా! రామ! రామ! అనుకుంటాను"

—టి. బాలకిషన్, లింగగిరి, (నల్గొండ జిల్లా)

## ఈశాన్య భాగానికి రూ. 30 కోట్ల విలువగల సైన్స్ మరియు టెక్నాలజీ సంస్థ:

అరుణాచల ప్రదేశ్‌లో ఇటానగరంలో ఏర్పాటు చేయబడుతున్న రూ. 30 కోట్ల విలువచేసే నార్త్ ఈస్టరన్ రీజనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు అండ్ టెక్నాలజీ దేశంలో ఈశాన్య భాగానికి ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

## రష్యా పాఠశాల విద్యార్థు కంప్యూటర్ కోర్సులు:

రష్యాలో అన్ని సెకండరీ విద్యా సంస్థలలోను క్రొత్తగా ఇన్‌ఫార్మాటిక్స్ ఫండమెంటల్స్ మరియు కంప్యూటర్ టెక్నాలజీ విషయాలను ప్రవేశపెడుతున్నారు. పదిలక్షలకు పైబడిన మైక్రో కంప్యూటర్లను పాఠశాలలకు ఇస్తారు 2000 సంవత్సరం నాటికి సెకండరీ మరియు వృత్తి సంబంధమగు పాఠశాలలలో 70,000 కంప్యూటరు గదులు తెరువబడతాయి.

* * *

## అమెరికాలో దారిద్ర్య రేఖ క్రింది పిల్లలు:

యునైటెడ్ నేషన్స్ శిశువుల అత్యవసర నిధి యునిసెఫ్ (unicef) తయారుచేసిన ప్రత్యేక రిపోర్టు ప్రకారం అమెరికాలో ప్రతి 5 మంది పిల్లలలోను ఒకరు దారిద్ర్యరేఖ క్రింద పేదరికాన్ని అనుభవిస్తున్నాడు. ఈ

(మిగతా 57 వ పేజీలో)

# జలగర్భంలో రోబోట్ సాహసం



జూలై 10 వ తేదీన జలగర్భంలో రోబోట్ స్కారాబ్ (scarab) ఫ్రెంచి వారి కేబిల్‌షిప్ లియాన్ థెవేనిన్ మీద నుండి అట్లాంటిక్ మహాసముద్రంలో భూగర్భాన్నుంచి, 329 ప్రయాణీకులతో జూన్ 23 వ పడిపోయిన భారతదేశపు బోయింగ్ 747 కనిష్కాకు చెందిన కాక్‌పిట్ వాయిస్ రికార్డును పైకి తీయగలిగింది. రిమోటు కంట్రోలు సదుపాయం ఉన్న సబ్‌మెరైన్ సముద్రమట్టానికి 2000 మీటర్ల లోతులో భూగర్భంమీదికి దించబడింది. ప్రపంచంలో ఇంత లోతు నుంచి ఇంతవరకు ఏ వస్తువు తీయబడలేదు.

స్కారాబ్ సాధనాన్ని 1976 లో ఒక అమెరికా కంపెనీ నిర్మించింది స్కారాబ్ ప్రత్యేకంగా ఏర్పాటైన 360 డిగ్రీల సోనా రీసెర్చి సహాయంతో 200 మీటర్ల లోతులో నీటిలో ఉండే వస్తువులను ఫొటోగ్రాఫులను కూడా తీయగలదు.

"పుణ్యవాసనలు ఊరకపోవు మూపె యెట్లు, తమ తము ఫలముల నిచ్చుగాని."

# ఇంటర్ పోల్

ఐ.సి.పి.ఓ. (ICPO) అనే 4 నాలుగు పొడి అక్షరాలు ఇంటర్నేషనల్ క్రైమ్ పోలీస్ ఆర్గనైజేషన్ అనే దానికి సాంకేతికంగా



ఉపయోగిస్తారు. సాధారణంగా దీనినే ఇంటర్ పోల్ (Interpol) అంటారు

ఇంటర్ పోల్ పెద్ద పెద్ద మోసగాళ్ళకు, నేరస్థులకు వాస్తవంగా తలనొప్పి కలిగిస్తుంది 1923 వ సంవత్సరానికి ముందు నేరస్థులు నిర్భయంగా విదేశాలకుపోయి చాటు మాటుగా తల దాచుకొని జీవించగలిగేవారు. ఒక్కొక్కప్పుడు వారి జాడే తెలిసేది కాదు. 1923 వ సం. లో ఆస్ట్రియా పోలీసు ప్రెసిడెంటు స్కోబెర్ (Schober) వియన్నా ముఖ్య కేంద్రంగా ఇంటర్ పోల్ వంటి ఒక సంస్థను ఏర్పాటు చేయించాడు.

ప్రారంభంలో కొన్ని దేశాలు ఈ సంస్థలో సభ్యులుగా చేరాయి. కాని జర్మనీలో హిట్లర్ నియంతాధికార పదవిని స్వీకరించే సమయానికి వివిధ రకాల రికార్డులు, ఫొటోలు, డాక్యు

## అభిప్రాయాలు

(అక్టోబరు 1985)

"ప్రేమ 'ప్రేమను' ప్రేమిస్తుంది,
కామం 'శీలాన్ని' కాటేస్తుంది."

—చిక్కనూరి రాజేశ్వర్, కోరట్ కల్,
(నిర్మల్ తాలూకా)

• • •

"స్త్రీని పురుషుడి కంటే మిన్నగా
చూడక్కరలేదు,
స్త్రీగా గౌరవిస్తే చాలు"

—జి. నాగమణి, ఉర్లాం,
(శ్రీకాకుళం జిల్లా)

• • •

"రాళ్ళు ఎన్నో—కాని పూజ లందు
కునేవి కొన్నే
మనుషులు ఎందరో—కాని
మహాత్ములు కొందరే."

—వి. వి. నరసింహారావు,
విశాఖపట్టణం.

---

"నురుగు, కెరటాలు. బుడగలు సముద్రంలో పుట్టి సముద్రంలోనే కలిసినట్లు
జగత్తు అంతా పరమాత్మచేత గలిగి మరల పరమాత్మలోనే కలసిపోతూంది."

మెంట్లు గుట్టలు గుట్టలుగా పేరుకుపోయాయి. నేరాలు తగ్గిపోవడానికి ప్రారంభించాయి.

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. నేరాలు అభివృద్ధి పొందడానికి వాతావరణం మరింత అనుకూలమైంది. యూరప్‌లో శాంతికే కరువైంది. సోక్డబర్ ప్రారంభించిన సంస్థను హిట్లరు జర్మనీ ముఖ్య నగరమైన బెర్లిన్‌కి తరలించాడు. అక్కడ ఇది పూర్తిగా పేరు ప్రతిష్ఠలు లేకుండా పోయింది.

యుద్ధానంతరం తిరిగి దీనిని ప్రారంభించవలసి వచ్చింది. దీని ఉద్యమాలు కొనసాగించడానికి ఫ్రెంచి ప్రభుత్వం పారిస్‌లో కొంత ప్రదేశాన్ని కేటాయించింది. పూర్తిగా ఫ్రాన్స్ నిధులతో ఇంటర్‌పోల్ సంస్థ ప్రారంభమైంది. దీంతో ప్రపంచంలో నేర ప్రవృత్తికి గట్టి చిక్కులు, నిర్బంధాలు పొడసూపాయి.

ఈనాడు ఇంటర్‌పోల్‌లో బ్రహ్మాండమైన గ్రంథాలయ విభాగంలో వివిధ భాషలలో లెక్కలేనన్ని రిఫరెన్స్ పుస్తకాలు, ఒక పరిశోధక విభాగం, ఫింగర్ ప్రింట్ విభాగం, ఫోటోల విభాగం ఉన్నాయి. పరారైన నేరస్థులను అతి సులభంగా పట్టుకోడానికి ఇవన్నీ సహకరిస్తాయి.

ప్రతీ నేరస్థుని రూపురేఖలు, అలవాట్లు,

## అణుబాంబు పరిశోధనకు 500 లక్షల పౌండ్ల వ్యయం!



అణుబాంబు పరిశోధనకు 500,000,000 పౌండ్లు వ్యయమవుతుంది. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో జపాను నగరాల మీద వేసిన రెండు అణుబాంబులు సూర్యుని శక్తితో సమంగా ఉన్నాయి. ఇవి వరుసగా అమెరికన్, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, డేనిష్, ఇటాలియన్ పరిశోధనల ఫలితం.

మెక్సికోలో ఒక ఎడారిలో జరిపిన అణుబాంబు ప్రథమ పరిశోధనవల్ల ఏర్పడిన ప్రేలుడికి 8 మైళ్ళు దూరంలో ఉన్న ఇద్దరు మనుష్యులు నేలమీదికి త్రోసివేయబడ్డారు. 40,000 అడుగుల ఎత్తుకు మేఘంలా పొగ క్రమ్ముకుంది. పూర్తిగా చల్లారిన తరువాత పరిశీలిస్తే బాంబును విడిచిన ఉక్కు స్తంభం పూర్తిగా ఆవిరి అయిపోయింది.

హిరోషిమాలో బాంబు వేసిన తరువాత 60,000 మంది గాయపడ్డారు. 8 మైళ్ళ చుట్టుపట్ల ఇళ్ళు పూర్తిగా నేలమట్టం అయాయి.

"జీవించి యున్నప్పుడు దైవావస్థను పొందినవారికి ఎచ్చట నైనను దైవప్రాప్తి కలుగును."

ఇతర గుర్తులు సేకరింపబడి ఉంటాయి. వీటి రంగు (Tab) గుర్తుతో ప్రత్యేకిస్తే ఆ నేరస్థుడు కళ్ళజోడు వేసుకుని ఉంటాడని అర్థం. అదేవిధంగా ఒకడికి గిరజాల జుట్టు ఉండవచ్చు, చేతులకు ఫర్ గ్లౌస్ వేసుకోవచ్చు. వెన్నతో బన్ను తినవచ్చు. మందులను తయారు చేయవచ్చు. ఇటువంటి విషయాలన్నీ రికార్డుచేసి ఉంచుతారు. వాటికి తగినట్టుగా రంగు రంగుల ట్యాబ్‌లతో గుర్తిస్తారు.

ఇప్పుడు జరుగుతూన్న అంతర్జాతీయ నేరాలను నిరోధించడానికి ఇంటర్‌పోల్ మరికొన్ని మార్పులతో ఇతోధిక పటిష్ఠంగా మారబోతూంది. ఇంటర్ పోల్ 1946 లో ఫ్రాన్స్‌కు తరలించినప్పటి నుంచీ ఫ్రెంచి పోలీసు అధికారులే ఎక్కువ సభ్యులుగా ఉంటున్నప్పటికీ ఇది స్వాతంత్ర్య అంతర్దేశీయ సంస్థగా ఏర్పాటు అవుతూంది.

స్కాట్లండ్ యార్డ్ (లండన్) ప్రత్యేక విభాగానికి చెందిన రేమాండ్ కెండాల్ గత 30 సంవత్సరాల నుంచి ఇంటర్‌పోల్‌కి అధికార పదవిని అధిష్టించాడు. ఇతడు ఫ్రెంచి దేశానికి చెందని మొట్టమొదటి ఇంటర్‌పోల్ అధికారి.

ఇప్పటివరకు ఇంటర్‌పోల్‌లో రికార్డులకు, ఫోటోలకు కార్డ్ ఇండెక్స్ విధానం ఏర్పడి ఉండేది. ఇది చాలా శ్రమతోను, ప్రయాసతోను కూడిన విధానం. ఇప్పుడు ఇక్కడ సుమారు 20 లక్షలమంది నేరస్థులకు చెందిన రికార్డులకు, ఫోటోలకు, వివరాలకూ కంప్యూటర్ విధానం ఏర్పరచారు.

ఫ్రాన్స్‌లో బట్టలపరిశ్రమకు, బ్యాంకింగ్‌లకు ముఖ్యకేంద్రమైన లయన్స్ (Lyons) నగరంలో ఇంటర్‌పోల్ సంస్థ క్రొత్తభవనం 1988 లో పూర్తి కాబోతుంది. 40 వివిధ దేశాలకు చెందిన 60 పోలీసు అధికారులతో సహా 250 మంది ఉద్యోగస్థులు ఈ సువిశాల పరిశోధక కేంద్రంలో నేరస్థుల వివరాలను క్రోడీకరించి వివరించుకో గలుగుతారు.

ఇంటర్‌పోల్‌కి రేడియో మరింత సహకరిస్తుంది. ప్రపంచం అంతటా 24 ఇతర కేంద్రాలను నియంత్రించే రేడియో కంట్రోల్ స్టేషన్ పారిస్‌కు అవల సంస్థాపితమైంది.

ఆధునిక యుగంలో నేరస్థులు విమానాలలో, కార్లలో, హెలికాప్టర్లలో, సబ్ మెరైన్‌లలో పారిపోవడానికి ప్రయత్నిస్తున్నారు. రేడియో వార్నింగులు వల్ల, సాటిలైటు వార్తా ప్రసారాల వల్ల అతిశీఘ్రంగా నేరస్థులను తెలుసుకోడానికి అవకాశాలు కలుగుతున్నాయి.

## పాలవెల్లిలో 'చీకటి గది'

బెర్క్లీ (అమెరికా) లో కాలిఫోర్నియా యూనివర్సిటీ శాస్త్ర పరిశోధక బృందం వినువీధిలో పాలవెల్లి మధ్య గాఢాంధకారమైన 'చీకటి గది' ఒకటుందని నిరూపిస్తున్నారు. ఈ చీకటి గది చుట్టూ 96 ట్రిలియను కిలోమీటర్ల వైశాల్యం అల్పసాంద్రతగల వాయువు ఆవరించుకుని ఉంది. ఈ గదిలో కనిపించని ద్రవ్యరాశి అంతా కుదించుకుని ఉందని, ఇది సూర్యునికి 40 లక్షల రెట్లు ఉంటుందని వీరి అభిప్రాయం.

"బంధువు లెంత ధనవంతులైనా తన ధనమే తనకు ఉపయోగపడుతుంది."

# నవ్వు

## ఇంతకంటే అధ్వాన్నమైన కొంపలెన్నో చూశాను!

ఒక ఇంటావిడ మా గుమ్మం ముందు అడుక్కోడానికి సిగ్గులేదూ?



భిక్షకుడు: తల్లీ! కోపంవద్దు ఈ ఇంటి కంటే అధ్వాన్నమైన కొంపలెన్నో చూశాను.

* * *

## తరువాత అలవాటు

జోస్యుడు: చూడండి, నిజం చెప్పా లంటే మీకు 40 ఏళ్ళదాకా ధనాదాయం శూన్యం-సుఖం అసలు ఉండదు....

జాతకుడు: (ఆశతో) ఆ తరువాత?

జోస్యుడు: ఆ తరువాత దానికి అల వాటు పడిపోతారు. అంతే!

## లేకపోతే క్రిటిక్ అయిపోతా!

ఒకప్పుడు పారిస్(ఫ్రాన్స్)లో స్టూడియో తెరిచిన ఇద్దరు చిత్ర కారులు తిరిగి న్యూయార్కు (అమెరికా)లో కలుసుకున్న ప్పుడు మొదటి చిత్రకారుడు 'నీ కీ మధ్య కంటికి ఆపరేషను అయింది అని తెలిసింది. మరి పెయింటింగులు విడవకుండా చేస్తావా?' అని అడిగాడు. అందుకు రెండవ చిత్ర కారుడు 'వేయలేకపోతే క్రిటిక్ అయిపోతా' అన్నాడు.

* * *

## మా లాయరుగారు ఆఖరిపైసా దాకా తీసేసుకున్నారు!

జడ్జి: (నేరస్థుడ్ని పిలిచి) నీ మీద శిక్ష విధించే ముందు ఏమైనా నీవు నివేదించు కుంటావా?

---

## గంగాతీరపు నగరాలు నూరు

పవిత్ర గంగాజలాలు పావనం చేస్తున్న ఊళ్ళు సరిగ్గా 100 ఉన్నాయి. (ఉత్తర ప్రదేశ్‌లో 26, బీహార్‌లో 16, పశ్చిమ బెంగాల్‌లో 59). ఈ 100 నగరాలలో ఉన్న ఇళ్ళలోని మురికినీరు, పరిశ్రమలలో వాడిన కాలుష్య జలాలు గంగానదిని కలుషితం చేస్తున్నాయి.

---

"నానా గుణములతో గూడియుండు ప్రాణికోట్ల హృదయములో ఆత్మ ఒకటే."

ఖైదీ: యువర్ ఆనర్! ముందే మా లాయరుగారు చివరిపై సొదాకా తీసేసుకున్నారండి!

• • •

## మిక్కిలి ఫారిన్ ఏది?

మిసెస్ శామ్యూల్: 'అయ్యా మా పిల్లవాడికి ఒగ ఫారిన్ భాష నేర్పాలండి."

ప్రొఫెసర్‌గారు: అయ్యో అంత కంటేనా? ఫ్రెంచా, జర్మనా, రష్యనా, ఇటాలియనా, స్పానిషా....?

మిసెస్ శామ్యూల్: ఏది ఎక్కువ ఫారిన్ అండీ?

• • •

## నాకు తెలుసు!

ఉపాధ్యాయుడు: కుడిపక్క తూర్పు, ఎడమప్రక్క పశ్చిమం, నీ ముందు ఉత్తరం. అయితే ఇప్పుడు చెప్పు నీ వెనుక!

బాలుడు: నాకు తెలుసండి. మా అమ్మతో కూడా చెప్పా, వెనకాల చిరుగుందని!

• • •

## మీ రందులో పడేసే ఉండరు!

కెమిస్ట్రీ క్లాసులో ఉపాధ్యాయుడు వివిధ ఆసిడ్‌ల లక్షణాలను చెప్పడానికి డెమాన్‌స్ట్రేటు చేస్తూ "నే నిప్పుడు ఈ 50 పైసల నాణాన్ని ఆసిడ్ గ్లాసులో వేస్తాను. అది కరుగుతుందా?

"కరగదు" అని ఒక విద్యార్థి అన్నాడు.

"అయితే ఇప్పుడు నువ్వు క్లాసుకు చెప్పు ఎందుకు కరగదో?"

"కరిగేటట్లయితే మీ రందులో వేసే ఉండరు గదా!"

• • •

## తాళం వేశానండి!

ఒక రైలు కంపార్టుమెంటులో తొందరగా ఎక్కుతూ ఒక ప్రయాణీకుడు భారంగా ఉండే చిన్నపెట్టె పై బల్లమీద పెట్టాడు. సగం ముందుకుంది. ఎదురుగా క్రింద సీట్లో కూచున్న భయస్తుడు "అయ్యా! అయ్యా! పెట్టె భద్రంగా ఉందా?" అన్నాడు.. "ఓ (ధీమాగా) గాడ్రెజ్ తాళం వేశానండి." ●

## భావపరిచయ పోటీ

(అక్టోబరు 1985)

"కుచేలుని విందుకు సలాములు
సూట్‌కేస్ పసందుకు గులాములు."

—కోలపల్లి ఈశ్వరరావు, నెల్లూరు.

• • •

"అటుకు లిచ్చి కుచేలుడు ఐశ్వర్యము పొందితే
లంచమిచ్చి నిరుద్యోగి ఉద్యోగం పొందాడు."

—డి. లక్ష్మణ్, హైదరాబాద్.

• • •

"ద్వాపర యుగానికి
కలియుగానికి తేడా ఎంతో!"

—వి. ఎస్. ఆర్. అమ్మలు,
బేకేపూర్, (ఒరిస్సా)

---

"వేరులుండువరకు చెట్లు చావనట్లు, వ్యక్తులుండువరకు అజ్ఞానము నశింపదు."

# ఉద్యోగస్థులలో మెరికలను గుర్తించాలి

సదానంద మొహంతీ

సాధారణంగా పెద్ద పెద్ద సంస్థలలో కార్య నిర్వాహణాధికారులు తమ క్రింద పని చేసే ఉద్యోగస్థులు మూర్ఖులని, అవివేకులని,



యోచనాశక్తి శూన్యులని అంటూంటారు. వారు ఎంత మాత్రం బాధ్యత వహించరని, విశ్వాసంతో పనులు నిర్వహించరని అభి ప్రాయపడతారు. కాని అది వాస్తవం కాదు. కేవలం అపోహ మాత్రమే. మానసికంగా ఏర్పడిన దురభిప్రాయం తప్ప వేరేకాదు. ప్రతి వ్యక్తికీ అమూల్యమైన వివేకం, నైపుణ్యం ఉంటనే ఉంటుంది. ప్రతి వ్యక్తిలోను దీక్షతో కూడిన సృజనాత్మక శక్తి నిగూఢమై ఉంటుంది. అట్టి శక్తిని సక్రమంగా వినియోగించుకోవడం అధికారుల ముఖ్య కర్తవ్యం.

జనరల్ మోటార్స్ కంపెనీలో ఒక పెద్ద ఇంజనీరు చార్లెస్ కెట్టరింగ్ ఒకసారి తన కంపెనీలో ఒక కార్మికుడు ఒక క్రొత్త ఓడను అదే పనిగా పరీక్షించడం గమనించాడు. ఆశ్చర్యం కలిగి ఏమిటి చూస్తున్నావు? అని అడిగాడు. దానికి ప్రొపెల్లర్ చాలా పెద్దదిగా ఉంది అన్నాడు కార్మికుడు. అది పెద్దదిగా ఉందని ఎలా చెప్పగలవు అని కెట్టరింగ్ అడిగాడు. కార్మికుడు నవ్వుతూ అది 5 లేక 5½ అంగుళాలు పెద్దది అన్నాడు.

కెట్టరింగ్‌కి ఆ జవాబు ఎంతో వింతగా తోచింది. వెంటనే ఇద్దరు ఇంజనీర్లను పిలి

(మిగతా 16 వ పేజీలో)

## మధురాతి మధురం

పెరుగ్వేలో పెరిగే ప్రపంచంలోనే మధురాతి మధురమైన (తియ్యని) వృక్షం-యూపటోరియం రిబాడియనమ్ (Eupatorium Rebaudianuem) ను ఇంగ్లీషులో స్టెవియా (stevia) అంటారు. దీనివల్ల ఉత్పత్తి అయ్యే ద్రావణం చక్కెర కంటె 300 రెట్లు తీయగా ఉంటుంది. ఒక కప్పు కాఫీకి గాని టీకి గాని ఈ ద్రావణం ఒకే ఒక చుక్క చాలు.

"వివక్షత లేకుండా సకల ప్రాణులను ప్రేమించేవాడు భగవంతుణ్ణి ఉత్తమ రీతిలో ప్రార్థించ గలుగుతున్నాడు."

# మిటియో

ఉల్కాలు (Meteors) అంతరిక్షంలో అతి వేగంగా దూసుకుపోయే ఖగోళ రాసులు. ఇవి వాతావరణంలోకి ప్రవేశించే



టప్పటికి వాటికీ, గాలికీ మధ్యగల బ్రహ్మాండమైన రాపిడివల్ల ఈ ఖగోళరాసులు తెల్లని కాంతితో మండుతాయి. అందుకే ఇవి కనిపిస్తాయి. వాతావరణంలో దూసుకుపోతూ చాలామటుకు ఉల్కాలు పూర్తిగా మండిపోయి బూడిదగా ఏర్పడి హరించిపోతాయి. భూమిని చేరిన కొద్ది ఉల్కాలు ఎంతమాత్రం నష్టం కలిగించినట్టు కనిపించదు. కాని జూన్ 30, 1908లో సుమారు 130 టన్నులు తూగే పెద్ద ఉల్కా సైబీరియా (రష్యాలో) మారుమూల పడింది. దీనివల్ల కలిగిన అదురు అది పడినచోట నుండి 8000 మైళ్ళ దూరంలో ఒక సాధనం రికార్డు చేసింది. ఆ శబ్దం 600 మైళ్ళదాకా వినిపించింది. దీని వల్ల చెలరేగిన గాలి వల్ల 35 మైళ్ళ దూరం వరకు చుట్టుప్రక్కల అడవు లన్నీ మండిపోయాయి.

అసలు ఉధృతం వల్ల అణువులుగా చెదిరిపోయి పడ్డచోట పెద్ద పల్లం ఏర్పడింది. బ్రిటనులో లండన్ నగరంమీద ఇది పడి ఉంటే లండన్ నగరం అంతా ధ్వంసం అయి ఉండేది. సైబీరియా (రష్యా) క్రాస్నోయార్స్క్ ప్రదేశంలో పడిన ఉల్కాలను కనుగొన్న 235 సంవత్సరాలు తరువాత రష్యాలో మరో 170 ఉల్కాలు కనుగొనబడ్డాయి. ప్రతీ సంవత్సరం దాదాపు 50 ఉల్కాలు ఈ ప్రదేశంలో భూమిమీద పడుతున్నాయని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. కాని వీటిని సేకరించి వివరాలు తెలుసుకోలేక పోతున్నారు. వీటిలో సౌర కుటుంబంలో సూర్యుడు, చంద్రుడు ఇతర గ్రహాల నిర్మాణ విధానం గురించిన 'సంకేత' రహస్యాలు ఉంటాయని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అక్కడి మట్టిని పరీక్షించి రష్యా శాస్త్రజ్ఞులు భూమిలో లెడ్ ఐసోటోపులను కనుగొన్నారు. ఇవి సౌరకుటుంబం కంటె మూడు రెట్లు పురాతనమైనవి. దీనివల్ల విశ్వ నిర్మాణానికి మౌలిక పదార్థాలను తెలుసుకో గలరు.

---

"ఎలుక పు బొమ్మ బరువుకు చేటు."

# విజయానికి పొరపాట్లు మెట్లు

జీవితంలో అనేక పొరపాట్లు జరుగవచ్చు. కాని ధైర్యం, పట్టుదల, సాహసం ఉన్న వాళ్ళకి పొరపాట్లు విజయానికి ఒక మార్గం.



ఎమర్సన్

పొరపాట్లు జీవితంలో అంగీకరించ దగినవే. జీవితంలో పరిపూర్ణతను పొందుటకు పొరపాట్లు అత్యవసరమైనవి. వీటి అనుభవం లేకుండా ఎటువంటి నైపుణ్యాన్ని ఎవరూ సాధించలేరు.

ఒకప్పుడు బెర్నార్డ్‌షా "మనిషి కష్టపడి ప్రయత్నించి స్కేటింగ్ నేర్చుకుంటాడు. ఈ విధంగానే అన్ని రంగాలలోను మనిషి ప్రగతిని పొందుతాడు" అని అన్నాడు.

రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్ "ప్రతీ రోజు చేయవలసినవి చేసి ఆ రోజునే ముగించుకో. నీవు ఆనాటికి చేయగలిగినది చేసేస్తావు. తప్పులు, పొరపాట్లు కలుగవచ్చు. వాటిని సాధ్యమైనంత త్వరలో మరచిపో. రేపు తిరిగి క్రొత్త రోజే. మంచి నూతన ఉత్సాహంతో మొదలుపెట్టు. ప్రయత్నాలతోనూ పొరపాట్లతోనూ సహజంగా లక్ష్యాన్ని పొందగలుగుతాం. విజయం పొందుతాం. విజయానికి మెట్లు అని చెప్పుకోతగ్గ పెద్ద పెద్ద పొరపాట్ల వల్లే అద్భుత సాధనలు అన్నీ సాధింపబడ్డాయి" అని చెప్పారు.

తప్పులను, పొరపాట్లను ఒప్పుకోడానికి వివేకాభివృద్ధి కలగాలి. ఈ వివేకం మానసిక పరిణామంమీదే ఆధారపడి ఉంటుంది. ●

(14 వ పేజీ తరువాయి)

పించి పరీక్ష చేయమన్నాడు. కార్మికుడు చెప్పినది అక్షరాలా నిజమని తేలింది. ప్రొఫైలర్ ¼ అంగుళాలు పెద్దదిగా ఉంది. ఈ విధంగా ఒక సాధారణ కార్మికుని అతీంద్రియ శక్తివల్ల సంస్థలో ఒక పెద్ద పొరపాటు తప్పింది.

కాబట్టి ప్రతీ వ్యక్తిలోనూ మహత్తరమైన శక్తి నిబిడీకృతమై ఉంటుంది అటువంటి వారికి తగిన అవకాశం, ఉత్సాహం కల్పించినప్పుడు వారిలో నిగూఢమై ఉన్న అతీంద్రియ శక్తులు చైతన్యవంతంగా ప్రభవిస్తాయి కాబట్టి క్రింది ఉద్యోగస్థులను గౌరవించి వారి శక్తులను వినియోగించుకోటం అధికార ధర్మం. ఏ సంస్థలోనైనా సరే సంస్థయొక్క విజయం అందరి ఉద్యోగస్థుల మీదే ఆధారపడి ఉంటుంది. ●

---

"వివేకవంతుడు చేసిచూపునేగాని, మాటలతో చెప్పడు." —లియోట్సే

# నిర్ణయాలు తీసుకోడం ఎలా?

ః. క్లైవ్. డి. హర్లీ

ఒక కారు డ్రైవరు ఒక కిలోమీటరు దూరం ప్రయాణంలో అధమం 20 నిర్ణయాలైనా తీసుకుంటాడు. సామాన్యుడికి ఈ నిర్ణయాలు మనసులో అంత వేగంగా తట్టవు. కాని ప్రతిరోజూ, ప్రతినిత్యం మనం సవాలక్ష నిర్ణయాలను తీసుకుంటూనే ఉంటాం.



'రేపు ఎన్నిగంటలకు లేవాలి?'
'రేపు ఏం బట్టలు వేసుకుందాం?'
'ఈరోజు ఏం తిందాం?'
ఇంకా కొందరు
'పెళ్ళి చేసుకోవాలా?'
'ఏ ఉద్యోగానికి ప్రయత్నించాలి?'

'ఏ విధంగా పరిష్కారం చేసుకుంటే బాగుంటుంది?' అని మానసికంగా నిర్ణయాలు తీసుకుంటారు.

నిర్ణయాలు తీసుకోడం అంటే మనసులో ఇష్టానుసారంగా తీర్మానం ఏర్పరచుకుని దాని ప్రకారం కార్యక్రమం కొనసాగించడం. దీంట్లో మన ఇష్టమే ముఖ్యపాత్ర వహిస్తుంది. చేసిన నిర్ణయాలనుబట్టి మన వ్యక్తిత్వాన్ని నిరూపించుకోడానికి ప్రయత్నిస్తాం. జీవి

---

## భారతదేశపు పది పెద్ద హోటళ్ళు

అశోకా—న్యూఢిల్లీ
సెంటార్—బొంబాయి
చోళా—మద్రాసు
ఫోర్ట్ అగుఆడా బీచ్ రిసార్టు—గోవా
గ్రాండ్—కలకత్తా
కోవలమ్ బీచ్ రిసార్టు—కోవలమ్ (మద్రాసు)
ఒబెరాయ్ ఇంటర్ కాంటినెంటల్—ఢిల్లీ
ఒబెరాయ్ షెరటన్—బొంబాయి
తాజ్ మహల్ మరియు తాజ్ ఇంటర్ కాంటినెంటల్ — బొంబాయి
తాజ్ మహల్—ఢిల్లీ.

"మోక్షమార్గము వాడిమిగల కత్తిపై నడక వంటిది."

తంలో మనం కేవలం ప్రేక్షకులం మాత్రమే కాదు. పరమాత్మని విశ్వంలో పాల్గొని కార్యాచరణను నిర్వహిస్తాం. మన ఇష్టాలు, నిర్ణయాల వల్ల ప్రపంచాన్ని తీర్చి దిద్దుకో గలుగుతాం.

సాధ్యమైన కొన్ని నిర్ణయాలకు మార్గాలు:

1. లక్ష్యాన్ని ఏర్పరచుకోవాలి: ఒక ఉద్యమానికి సంబంధించిన అంశాలను విశదంగా పరీక్షించి విమర్శించుకుని ముఖ్య సమస్యను గ్రహించాలి. పీటర్ డ్రకర్ అనే మేనేజిమెంటు కన్సల్టెంటు 'తప్పుడు జవాబుల వల్ల తీవ్రమైన దోషం కలుగక పోయినా తప్పుడు ప్రశ్నలే అసలైన అపాయాలకు దారితీస్తాయి' అన్నాడు.

2. చేయవలసిన విధానాన్ని వెతికి పట్టాలి: క్రొత్త విషయాలను కనిపెట్టదలచుకున్న వ్యక్తి తన ఉద్యమ సాధనలో ఏర్పడే మార్పులకు లోనవాలి. మనస్సులో అసలు విషయానికి సంబంధించని విషయాలను పెట్టుకోకుండా ఉంటే చేపట్టిన నిర్ణయ లక్ష్యాన్ని సాధించుకోడానికి క్రొత్త క్రొత్త మార్గాలు కనిపిస్తాయి.

3. జ్ఞానాన్ని వృద్ధి చేసుకోవాలి: ఎవరి దగ్గరనుంచి అయితే క్రొత్త విషయాలు తెలుసుకోగలం అనుకుంటామో వారితో విషయం పూర్తిగా చర్చించాలి. నిర్ణయాలు తీసుకోడం వ్యక్తిగతమైనప్పటికీ లక్ష్య సాధనకు కావలసిన పూర్వ తతంగం అంతా నలుగురితో కలిపి ఆలోచించి, చర్చించి నిర్ణయించు కోవాలి.

4. సాధ్యాసాధ్య వివేచన. నిర్ణయించుకున్న తీర్మానాలను వివేకంతో పరిశీలించి, దానివల్ల పొందగల లాభ నష్టాలను తెలుసుకోవాలి. ప్రత్యేక తీర్మానం లేక నిర్ణయం యొక్క విశిష్టతను, దానివల్ల మనకు కలిగే లాభాలను గ్రహించాలి.

5. పరిష్కారం పక్వం పొందాలి: నిర్ణయాలు తీసుకోడం సృజనాత్మకమైన పని.

## సూర్యుని ఉపరితల ఉష్ణం



సూర్యుని ఉపరితలపు వేడి 10,000°F అని అంచనా వేయబడింది. సూర్యుని మధ్య భాగంలో ఫ్లూయిడ్ల ఒత్తిడివల్ల ఏర్పడే ఉష్ణము దీనికి 40,000 రెట్లు అధికంగా ఉంటుంది. అయినా కొన్ని నక్షత్రాల 70,000°F ఉపరితలపు వేడితో దీన్ని పరిపోలిస్తే సూర్యుని ఉపరితలం చల్లగానే ఉంటుంది. ఈ నక్షత్రాల మధ్య భాగాలలో ఉండే వేడిమి వాటి ఉపరితలపు వేడికి తగినట్లుగా చాలా అధికంగా ఉంటుంది.

"ఒకరిని పూర్తిగా అర్థం చేసుకొనకుండా మొదట నమ్మి, పిదప దూషించడం మూర్ఖలక్షణం."

చేపట్టిన నిర్ణయాన్ని పరిశీలించి, సాధక బాధకాలు తెలుసుకుని తొందరపాటు లేకుండా నిర్ణయాన్ని సాధించడానికి, తగిన ఉపాయాలను మానసికంగా ఏర్పాటు చేసుకోడానికి కొంత కాలావధి అవసరం.



6. నిర్ధారణ: జీవితం సామాన్యంకాదు. అతి సాహసంతో కూడినది. ఏ నిర్ణయమైనా సరే సాహసంతో కూడుకుని ఉంటుంది. అసలు విషయాన్ని ధీమాగా ధైర్యంతో ఎదుర్కోవాలి. ఫలితాంశ పరిణామం విషమించినా భయపడి కంగారుతో అసలు కార్యం చెడగొట్టుకోకూడదు.

రెండువందల సంవత్సరాలకు పూర్వం ఒక గ్రీకు నావికుడు ఆసియా మైనర్ తీరంలో ఓడమీద ప్రయాణం చేస్తూ ఉండగా ఓడ మునిగిపోయింది. అతడి చరమవార్త: "ఓడ ప్రయాణానికి భయపడవద్దు. ఎన్నెన్నో ఓడలు పెద్దపెద్ద తుఫానులను తట్టుకున్నాయి."

మంచి నిర్ణయాల తీరు:

1. వాస్తవాలు, మనోభావాలు: వాస్తవత బాగోగుల తార్కిక విచారణ నిర్ణయానికి ముఖ్యలక్షణం. మోహం, ఆవేశం పెడదారిని పట్టిస్తాయి. మోహావేశాలు యుక్తమైన సమాలోచనకు అవరోధాలు.

2. యోచన: యోచనలో స్వబుద్ధి ఎంతవరకు ఉంది. ఇతరులనుంచి గ్రహించినది ఏమిటి? మానసికంగా సమాధానం ఏర్పడిందా? యోచనలతోనే కాలం గడచిపోతూందా? అనే విషయాలు గమనించాలి.

3. సరళత: సమస్యను మరో విధంగా పరిష్కరించుకొనే విధానం ఉందా? చేపట్టినది ఆచరణ యోగ్యమైనదా కాదా తెలుసుకోవాలి.

4. శ్రమ, ఓర్పు: సమయ, సందర్భాలను బాగా యోచించాలి. మొండితనం, పట్టుదల పనికిరాదు.

5. నిబంధనలు, కట్టుబాట్లు సమయం, వయస్సు, విద్య, శాహతు అంతస్తు, సమర్థత, విజ్ఞానం మొదలైనవి ఏవేవి, ఎంతెంత లోపించాయి అనేది తెలుసుకోడం ముఖ్యం. సామర్థ్యవంతమైన నిర్ణయాలకు ఇవే సహకరించేవి.

6. బాధ్యత: ప్రతి ఒక్కరు వ్యక్తిగత లాభాలను మాత్రమే ఆశించకుండా ఇతరుల శ్రేయస్సును, సామూహిక శ్రేయస్సును కూడా మనస్సులో ఉంచుకోవాలి.

మనకే కాదు ఇతరులకు కూడా మనకంటే ఎక్కువ విజ్ఞానం, వివేకం ఉంటుందనే మాట మరచిపోకూడదు.

"ఒకరిని చెడుగా అభివర్ణించే ముందు తను ఎంతవరకు మంచివాడు అన్న విషయం తెలుసుకొనుట ముఖ్యం."

# బహుమతి పొందిన వ్యాసం

## నేటి సినీమాలు - నైతిక సాంస్కృతిక విలువలు

కె. నాగలక్ష్మి, ఇచ్ఛాపురం.

సినీమా అన్నది ఆధునిక యుగంలో సామాన్య మానవునికి అందుబాటులో ఉండే వినోద సాధనం. కేవలం వినోద సాధనంగానే కాకుండా కొంతవరకు విజ్ఞాన సాధనంగా కూడా వినియోగించుకోవచ్చు. పూర్వం సినీ మాలు తీసినవారు మన సంస్కృతి, మన ఆచార వ్యవహారాలు ప్రతిబింబించేటట్లు కళాత్మక విలువలను దృష్టిలో ఉంచుకుని తీసేవారు. కాని నేడు సినీ ప్రపంచంలో పోటీ పెరిగి నిర్మాణ సంస్థలు వ్యాపార సంస్థలుగా మారాయి.

నేటి సినీమాలు సంఘంలో ప్రబలిపోయిన నేరప్రవృత్తినీ, అవినీతినీ రెచ్చగొట్టే దొంగతనాలు, దోపిడీలు, హత్యలూ, మానభంగాలు విచ్చలవిడిగా చూపిస్తున్నాయి. మానవులు చెడును గ్రహించినంత త్వరగా మంచిని గ్రహించలేరు కదా! ముఖ్యంగా నేటి యువతీ యువకులు ఈనాటి సినీమాలను అనుకరిస్తూ పూర్తిగా పతనానికి చేరువ అవుతున్నారు.

ప్రాచీన కాలంనుంచీ ఒక ప్రత్యేకమైన సంస్కృతిని కలిగి వస్త్రధారణలో గానీ, నడవడిలో గానీ ఆదర్శంగా ఉన్న మన 'స్త్రీ' ని నేటి సినీమాలలో అంగడి బొమ్మలా చూపుతున్నారు. పాశ్చాత్య నాగరికత ముసుగులో స్త్రీని అర్ధనగ్నంగా ప్రదర్శిస్తూ, నాట్యం పేరుతో పిచ్చిగంతులు వేయిస్తూ యువతలో కామాన్ని రెచ్చగొడుతున్నారు.

## మహిళల జీవిత ప్రమాణం



భారతదేశంలో స్త్రీల జీవిత ప్రమాణం గతంలో కంటే ఇప్పుడు అధికమైంది. 1951-వ సం. లో ఉన్న 31.7 జీవిత ప్రమాణం 1981 సం.లో 54.6 సం. లకు పెరిగింది.

"సర్వం భగవదాయత్తం అని ప్రార్థించాలి. ప్రతీది మానవుని మీదే ఆధారపడి ఉందని ఉద్యమించాలి." —కార్డినల్ ఫ్రాన్సిస్

అసభ్యకరమైన, హింసాత్మకమైన దృశ్యాలను ప్రభుత్వం తొలగించాలి. దీనికి సమాజంలోని యువతీ యువకులుకూడా ముందుకు వచ్చి సంఘటితంగా ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి కళాత్మకమైన, నైతికమైన సినిమాలను నిర్మించడానికి నిర్మాతలకు ప్రోత్సాహం కల్పించాలి.

అప్పుడు చక్కని విజ్ఞానదాయకమైన, సందేశాత్మకమైన కళాత్మక విలువలతో విలసిల్లే చిత్రాలు నిర్మింపబడతాయి.

* * *

వి. జీవరాజు, చిలకలపూడి.

మన సంస్కృతిని గురించి ఉపన్యాసాలిచ్చే సంఘ సంస్కర్తలు నేటి సినిమాలను చూస్తే సిగ్గుపడక మానరు. నేటి సినిమాలు కుటుంబంతో చూడలేని సినిమాలు. పూర్వం స్త్రీకి గౌరవం. విలువ ఇచ్చే చిత్రాలే తయారయేవి; రేప్ సీనులు మచ్చుకైనా ఉండేవి కావు. అశ్లీల పదజాలము, అర్థరహితమైన సంభాషణలు, జుగుప్సాకరమైన పాటలు వినబడేవి కావు. ద్వంద్వార్థము ధ్వనించే పద ప్రయోగం జరిగినా అశ్లీలంగా మాత్రం ఉండేవికావు.

నేటి మన చిత్రాలన్నీ దాదాపు ఒకే మూసలో పోసిన విధంగా తయారవుతున్నాయి. ఈనాడు సినిమాలలో అవసరం ఉన్నా లేకపోయినా క్లబ్ డాన్సు సృష్టికరణ జరుగుతూంది.

సినిమాలు ప్రేక్షకులమీద ఎంత ప్రభావం కలిగి ఉంటాయి అనేది నిర్వివాదం. కొన్ని వందల సంవత్సరాలు కృషిచేసి సాధించిన అపూర్వమైన మన భాషకు, మన సంస్కృతికి నేటి సినిమాలలో పట్టిన దుర్గతిని తలచుకుంటే జుగుప్సాకరంగా ఉంటుంది.

సినిమాలు మన జీవితాలను అద్దం పట్టేవిగా ఉండాలి. మన తప్పులను, పొరబాట్లను సరిచేసుకునేలా మన సినిమాలు తయారైనవాడు మన సాంస్కృతిక విలువలు పెరుగుతాయి.

* * *

## పోలో తొలిసారిగా 1869 లో ఆడబడింది



పోలో ఆటను హాస్యంగా 'హాకీ ఆన్ హార్స్ బేక్' అంటారు. 'పోలో' అంటే ఇండస్ లోయలో బాల్టీలో మాట్లాడే భాషలో 'బంతి' అని అర్థం. ఇలాగే టిబెట్ భాషలో బంతిని పులు (pulu) అంటారు. కాబట్టి ఈ ఆట తూర్పు దేశాలకు సంబంధించినదే. క్రీ.పూ. 525 నుండి పర్షియనులు పోలో ఆడుతున్నారు. ఇంగ్లండులో 1869 సం. లో మొదటిసారి పోలో ఆడబడింది.

"మృత్తిక జలములచే బాహ్యశుద్ధి కలుగునట్లు
భక్తి వైరాగ్యములచే అంతఃశుద్ధి కలుగును."

ఎస్. మధుసూదనరావు, వసుంధర.

మనకున్న వినోద సాధనాలలో సినిమాకు ఉన్న ప్రాముఖ్యత మరి దేనికి లేదు. అతి తక్కువ ఖర్చుతో ఎక్కువ వినోదం, విజ్ఞానం పొందడానికి మానవునికి ఇది వరం.

సినిమాలవల్ల ప్రయోజనాలెన్నో అరిష్టాలు అన్ని. అనేక నూతన విషయాలు, వైజ్ఞానిక విషయాలు, మేధావుల సందేశాలు, వివిధ దేశాల ఆచార వ్యవహారాలు మొదలైనవి సినిమాలలో చూచి తెలుసుకోవచ్చు.

మన దేశంలో హిందీ సినిమాల కంటే తెలుగు సినిమాల సంఖ్య పెరిగిపోవడం తెలుగు చిత్రపరిశ్రమ అభివృద్ధిని తెలియ జేస్తుంది. అయితే ఈ సినిమాలు సంఖ్యా పరంగా ఎంత అభివృద్ధిని సాధించాయో సాంస్కృతిక నైతిక విలువ దృష్ట్యా అంత దిగజారిపోయాయి ద్వంద్వార్థ పాటలు, సెక్స్, హింస, నేరం మొదలైనవి కేవలం వ్యాపార దృష్టితో సినిమాలలో చొప్పించారు నిర్మాతలు. సినిమాలలో మంచి కంటే చెడు ప్రభావం ప్రేక్షకుల మీద చెరగని ముద్రవేసి ఎన్నెన్నో దుష్కార్యాలు, అవినీతి పనులు చేయడానికి కారణ మవుతున్నాయి.

నిర్మాతలు నైతిక సాంస్కృతిక విలువలు కూడిన చిత్రాలను నిర్మించడం అవసరం. వాస్తవికతకు సన్నిహితంగా ఉన్న సినిమాలను నిర్మించి దేశప్రగతికి సినీ నిర్మాతలు పాటుపడాలి.

## ఆసియా - ఆఫ్రికాలలో చిరుత పులులు



ఆసియా, ఆఫ్రికాలలో నివసించే చిరుత పులులు చిన్నవైనా మిక్కిలి బలిష్టమైనవి, చురుకైనవి, మిక్కిలి వేగంగా పరుగెత్త గలవి. నీటిలో ఇవి ఈదగలవు. వీటికి అతి తీక్షణమైన కళ్ళు, చెవులు ఉన్నాయి ఇవి సాధారణంగా రాత్రిపూట, మధ్యాహ్నం వేటకు బయలుదేరుతాయి. ముదక పసుపు వర్ణం శరీరంమీద నల్లటి చుక్కలుంటాయి.

చిరుతపులి ఒకసారి మానవ రక్తాన్ని రుచి మరిగితే సింహాన్ని మించి ప్రావీణ్యంగా ప్రవర్తిస్తుంది. రుద్ర ప్రయాగలో చిరుతపులి 125 మంది మనుషులను చంపితిన్నది.

సాధారణంగా చిరుతపులులు 168 సెం. మీ. నుండి 229 సెం. మీ. పొడవుంటాయి. 27 మొదలు 88 కి.గ్రా. బరువుంటాయి. ఒక్కొక్కప్పుడు వీటికి నల్లరంగు పులులు పుడుతుంటాయి. ఇది రంగులో తేడా తప్ప వేరే రకం కాదు. నల్ల చిరుతపులి చాలా భయంకరమైనదని అంటారు. కాని నల్ల రంగువల్ల వీటి భీకరత్వంలో గానీ నైజంలో గానీ, అలవాటులో గానీ తేడాలు ఏర్పడవు.

"దూడను వెంబడించు ఆవు వలె భక్తుని భగవంతుడు వెంబడించుచున్నాడు."

# సాగరజీవులు-ఖనిజాల ఉత్పాదన

సుజిత్ కుమార్ నహా

సముద్రంలో నివసించే చిన్న చిన్న జంతు జాలం ఇతర ప్రాణులు సముద్రపు నీటి నుండి మానవుడు అతి వ్యయప్రయాసలతో



సీ అర్చిన్

వేరుచేయగల పదార్థాలను అతి సులభంగా వేరుచేయ కలుగుతున్నాయి.

సముద్రంలో నివసించే అనేక రకాల వెన్నెముక లేని జంతువులు సముద్రపు నీటి నుండి వెనేడియం, కాడ్మియం, నికెల్, రాగి, జింక్, లెడ్ మొదలైన ధాతువులను గ్రహించే విశిష్ట శక్తి ఉంది.

సముద్రంలో నివసించే సీ అర్చిన్ (sea urchin), సీ కుకుంబర్ (sea cucumber) వెనేడియం ధాతువును అతి నైపుణ్యంగా వేరుచేస్తాయి. సీ అర్చిన్ గోళాకారంతో ముళ్ళతో నిండి ఉండే ప్రాణి. సీ కుకుంబర్ గట్టిగా పొడుగు దోసకాయలాగ ఉంటుంది.



సీకుకుంబర్

సీ కుకుంబర్ రక్తంలో 10 శాతం వెనేడియం ధాతువు ఉంది.

మస్సెల్ అనే జంతువులో కాడ్మియం, లెడ్ ఇంకా కొన్ని ఇతర ధాతువులు చేరి ఉంటాయి. కాడ్మియం, లెడ్ మానవుడికి తీవ్రమైన విషపదార్థాలైనా ఎంతమాత్రం విష ప్రభావం లేకుండా మస్సెల్ ఈ ధాతువును సహించగలదు.

సాధారణంగా సముద్రంలో అన్ని ప్రదేశాలలోనూ కనిపించేదే స్పాంజి. ఇవి పెద్ద

"ఎంత దారుణ రోగమైనా దివ్యరసాయనంచేత నశించినట్లు,
పాపము దైవధ్యానముచేత నశించును."

కుటుంబానికి చెందినవైనా జీవిత పరిణామంలో ఉన్నత స్థాయిని పొందలేదు. ఇవి





సాధారణ మస్సెల్

సామాన్య జంతుజాతికి చెందినవి. వీటి దేహనిర్మాణం సంకీర్ణవంతమైనదికాదు. వీటికి దేహం లోపల ఇతర అంగాలు ఉండవు. ఇవి ఐడిన్, నికెల్, సిలికాన్ ధాతువులను సముద్రపు నీటినుంచి సులభంగా గ్రహించ గలుగుతాయి.

మస్సెల్స్ జాతికి చెందిన అయిస్టర్ (oyster) ముఖ్యంగా రాగి, జింకు లోహాలను గ్రహిస్తుంది. లోబ్‌స్టర్ (పీత) రాగి, కోబాల్ట్ లోహాలను సముద్రపు నీటినుండి వేరుజేయగలదు.

సముద్రపు నీటిలో 'ఐడిన్ ఐడైడ్' లవణాల రూపంలో ఉంటుంది. సముద్రంలో పెరిగే నానావిధమైన కలుపులు ఈ లవణాలను సంగ్రహిస్తాయి. ఈ కలుపును కాల్చినప్పుడు వచ్చే బూడిదను 'కెల్ప్' (kelp) అంటారు. కుర్టాయిస్ (Courtois) అనే శాస్త్రజ్ఞుడు ప్రప్రథమంగా ఈ 'కెల్ప్' నుంచే 1812 లో ఐడిన్‌ను వేరు చేసాడు. ఇప్పటికి కూడా కెల్ప్‌నుంచే వ్యాపారసరళిలో ఐడిన్‌ను ఉత్పాదిస్తున్నారు. సముద్రంలో నివసించే చిన్న




స్పాంజి

చిన్న ప్రాణులు, మొక్కలు సముద్రపు నీటి నుంచి ఈ ధాతువులను ఎలా వేరు చేయ కలుగుతున్నాయి అనే విషయం ఇంకా శాస్త్రజ్ఞులకు తెలియని రహస్యం. దీన్ని పూర్తిగా అవగాహన చేసుకుంటే పుష్కలంగా లభించే సముద్రపు నీటినుంచి ఈ ధాతువులను సులభంగా విడదీసి మానవులు ఘనవిజయం పొందగలరు. ●

## ఆసియాలో అతి నూతనం

బెంగుళూరు (కర్ణాటక)లో యలహంకాలో సుప్రసిద్ధమైన 'ఇరుసు చక్రం' (wheel and axle) పరిశ్రమ అధునాతనమైంది. ఇక్కడ సంవత్సరానికి రూ. 10 కోట్లు విలువచేసే 70,000 చక్రాలు, 23,000 ఇరుసులు తయారుచేయవచ్చు.

"ఆత్మ విగ్రహం గలవాని రెండు ముఖ్యలక్షణాలు క్షమ, మర్యాద."

# పారిశ్రామిక కాలుష్యాలు

డా. ఎన్. కృష్ణమూర్తి

గత 50 సంవత్సరాలుగా పారిశ్రామిక రంగంలోను, ఇళ్ళలోను విస్తారంగా అనేక రసాయనిక పదార్థాలు ఉపయోగింపబడుతున్నాయి. అందువల్ల ఈ రసాయనిక పదార్థాలను గురించి, మానవుల ఆరోగ్యంపై వాటి ప్రభావాన్ని గురించి తెలుసుకోడం ముఖ్యమైన విషయంగా పరిణమించింది. ఆర్గానిక్ సాల్వెంట్లు, రెఫ్రిజిరెంట్లు, ఫ్యూమిగెంట్లు, ఎలుకల మందులు, కీటక నాశిని మందులు, పూతినాశిని మందులు, జెర్మిసైడు మందులు, రసాయనిక ఎరువులు, ప్రేలుడు మందులు మొదలైనవాటి ఉపయోగంవల్ల అనేక పారిశ్రామిక కాలుష్యాలు విషములుగా పరిణమించినప్పుడు జీవకోటికి, ప్రాణికోటికి ప్రాణాపాయం కలుగుతూంది.

విషాలు ముఖ్యంగా వాటి రసాయనిక స్వభావంవల్ల ప్రాణుల మీద ప్రభావితమై పూర్తిగా ప్రాణిని చంపడమో లేక ఆరోగ్యాన్ని చెడగొట్టడమో జరుగుతూంది. ఈ విషపదార్థాలు బాహ్య శారీరక సంపర్కంవల్ల కానీ. తక్కువ మోతాదుతో అంటే 50 మి. గ్రా. కడుపులో చేరుటవల్లగానీ ఇట్టి ఉపద్రవాలు సంభవిస్తున్నాయి. కాబట్టి పారిశ్రామిక కాలుష్యాలను, విషాలను గురించి నిర్ధారణగా తెలుసుకోడం, మదింపుచేయడం, వాటి ప్రభావాలను తగ్గించడం, నిరోధించడం మొదలైన విషయాలన్నీ తెలుసుకోవాలి.

విషాలు వాటి ప్రభావం చాలా ప్రాచీన

---

## రైలు ప్రయాణం ఎరుగని దరిద్రనారాయణులు

ప్రయాణాలు చేసే భారతదేశపు 75 శాతం గ్రామీణులలో 50 శాతం అసలు రైళ్ళలోనే ప్రయాణం చేయరు. చేసేవారు సంవత్సరానికి ఒకసారో లేక రెండేళ్ళ కొకసారో ప్రయాణం చేస్తారు.

"్యగముకొరకు త్యాగ మొనర్చుట కష్టం; కాని సేవకొరకు త్యాగ మొనర్చుట సులభం."

మైనది. గ్రీకు వైద్యుడు హిపోక్రిట్స్ (460 - 370 బి. సి.) లెడ్‌పాయిజనింగ్ ముఖ్యంగా లోహశుద్ధి కర్మాగారాలలో పనిచేసే కార్మికులకు సంభవిస్తుందని చెప్పాడు. సీసపు పాత్రలలోగాని, సీసపు తగడుల క్రింద నిల్వ ఉంచిన నీరుత్రాగడంవల్ల లెడ్‌పాయిజనింగ్ సంభవిస్తుందని విట్రూవియస్ పోలియో (70-16 బి. సి.) వివరించాడు. ముడి సల్ఫైట్ ఖనిజపదార్థాలు, కార్బన్ మానో ఆక్సైడ్ విషాలను గురించి గ్రీకులు, రోమనులు పూర్వమే తెలుసుకున్నారు. పర్షియా వైద్యనిపుణుడు అవిసెన్నా (Avicenna) (980-1037) ఆర్సెనిక్ ట్రై ఆక్సైడ్ విష పరిణామాన్ని గురించి తెలియజేసాడు.

పారిశ్రామిక కాలుష్యాలు లేక విషాలను ముఖ్యంగా ఘన పదార్థాలు, ద్రవ పదార్థాలు, వాయు పదార్థాలు అని మూడురకాలుగా వర్గీకరించవచ్చు. సాధారణంగా దుమ్ము, ధూళి, పొగ, ఆవిరి, పొగమంచు, తుంపరలతో పాటు సుమారు 200 రకాల హానికరమైన విషపదార్థాలు అనేక రూపాలుగా ఉంటున్నాయి. కార్బన్ మానోక్సైడువల్ల 15 లక్షల మంది, లెడ్‌వల్ల 8 లక్షలమంది, ఆర్సెనిక్‌వల్ల 34 వేలమంది, పాదరసం వల్ల 33 వేలమంది, సిలికా దుమ్మువల్ల 15 లక్షల మంది, ఆర్గానిక్ సాల్వెంట్లవల్ల 7 లక్షల మంది, బెంజీనువల్ల 30 వేలమంది కార్మికులు వివిధ పారిశ్రామిక కాలుష్యాలకు, విషాలకు గురి అవుతున్నారని అమెరికాలోని పబ్లిక్ హెల్త్ సర్వీసువారు సర్వేచేసి ప్రకటించారు.

ఈ అపాయకరమైన కాలుష్యాలు మానవ దేహంలోకి మూడు విధాలుగా చేరుతున్నాయి. (1) డ్రిల్లింగ్, క్వారీ పనులలో ఉద్భవించే దుమ్ము, పొగ, ఆవిరి ఇతర వాయువులను అచ్చటి కార్మికులు నాశికాపుటాలద్వారా ఊపిరితిత్తులలోకి పీల్చుటవల్ల, (2) నోటితో పీల్చినప్పుడు నోటిలోని లాలాజలం, నీరు లేక ఆహార పదార్థాలు మ్రింగడంవల్ల, (3) శారీర

## అతి స్థూలంగా పెరిగే సెక్వోయియా వృక్షాలు



కాలిఫోర్నియా (అమెరికా)లో పసిఫిక్ తీరాన పెరిగే సెక్వోయియా (sequoia)325 అడుగులు ఎత్తుగా, 30 అడుగులు లావుగా పెరుగుతాయి. వీటిలో కొన్ని 4,000 సంవత్సరాల నాటివి అంటారు. అసలైన రాకాసి వృక్షాలు 'రెడ్ వుడ్స్' 25 అ. లావుగా 30 అంతస్థుల భవనం అంత ఎత్తు—340 అడుగులు—పెరుగుతాయి.

"మతము లెన్నో పథము లన్ని"

కంగా చర్మ సంపర్కంచేత దేహంలో చేరడంవల్ల.



వివిధ పారిశ్రామిక కాలుష్యాలు, వాటి పరిణామాలు ఈ క్రింది విధంగా వివరించవచ్చు. 1. క్లోరిన్, నైట్రస్‌ఫ్యూమ్సు, సల్ఫర్ డయాక్సైడ్, పార్మాల్డి హైడ్ వంటి విష పదార్థాలవల్ల ముక్కులో మంట, 2. ఆర్సీన్, కార్బన్ మానోక్సైడ్ మరియు గ్లైకాల్స్ వంటి కాంపౌండులవల్ల శరీరంలో రక్తం లోని అనుఘటకాలలో మార్పులు ఏర్పడుట, 3. కార్బన్ డై సల్ఫైడ్ మరియు కార్బన్ యౌగికాలవల్ల మెదడుకు దెబ్బ తగలడంవల్ల నాడీ విధానం చెడిపోవడం, 4. క్లోరో ఇథేన్, బెంజీన్, టొలీన్‌లవల్ల వివిధ అంగాలు, సూక్ష్మ కణజాలం దెబ్బ తిని దేహారోగ్యం క్రమక్రమంగా నశించిపోవడం, 5. సిలికా, ఆస్బెస్టాస్, సిమెంటు దుమ్ము వగైరాలవల్ల ఊపిరితిత్తులు దెబ్బతిని వాయుకోశం చెడిపోవడం. ఇంతేగాకుండా ఈ పారిశ్రామిక కాలుష్యాలవల్ల, విషముల వల్ల ఏర్పడుతున్న ఇతర లక్షణాలను గమనించడం చాలా ముఖ్యం. 1. ఆసిడ్ పొగల వల్ల మరియు క్షార సంబంధమైన యౌగికాల వల్ల చర్మం మంటలు పెడుతుంది. ముక్కులలో మంట బయలుదేరి ఊపిరితిత్తులను, కళ్ళను ఆవరించిన సున్నితమైన పొరలకు హాని కలుగుతుంది, 2. ఇవి ఊపిరితిత్తుల లోనికి ప్రవేశించి రక్తప్రవాహంలో చేరి నాడీమండలాన్ని చెడగొట్టి దేహంలో వివిధ కణాలకు హాని కలిగించి పూర్తిగా ఆరోగ్యానికే భంగం కలిగిస్తాయి, 3. హైడ్రోజన్ సైనైడు, హైడ్రోజన్ సల్ఫైడ్, కార్బన్ మానోక్సైడ్‌ల వల్ల ఊపిరి ఆడక నాడి నిలిచిపోయే పరిస్థితి కూడా ఏర్పడుతుంది, 4. దుమ్ము, సిలికా, గ్రానైటు, ఆస్బెస్టాస్‌ల వల్ల ఊపిరితిత్తులు చెడిపోయి క్షయ వ్యాధి కలగడానికి అవకాశం కలుగుతుంది. విషం అతి తీవ్రంగా పరిణమించవచ్చు. లేక మానవ శరీరంలో దీర్ఘ కాల ప్రభావం కలిగి ఉండవచ్చు.

వాతావరణ కాలుష్యాలలో ధూమములు (smoke), ఆవిరిలు (fume)

## 150 లక్షల మంది యువ కార్మికులకు క్రొత్తగా ఉద్యోగావకాశాలు

భారతదేశంలో అన్నిచోట్లా బాల కార్మికులను తొలగిస్తే ఎలా లేదన్నా 150 లక్షల మంది యువకులకు ఉద్యోగాలు ఏర్పడతాయని అంచనా.

"బాహ్య సౌందర్యమును గాక, అంతః సౌందర్యమును జూడగలవాడే నిజమైన కళాకారుడు."

ముఖ్యమైనవి. సిలికోసిస్, ఆస్‌బెస్టోసిస్ వంటి ఊపిరితిత్తి రోగాలు దుమ్మును పీల్చడం వల్ల కలుగుతున్నాయి. లెడ్, కాడ్మియం మరియు రేడియం ధాతువుల ధూళిని పీల్చడం వల్ల అనేక విషలక్షణాలు ఏర్పడతాయి. అతి సున్నితమైన జింక్ ఆక్సైడ్ కణాలను పీల్చడంవల్ల మెటల్‌ఫ్యూమ్ జ్వరం వస్తుంది.

• ఇతర రేణువులు, దుమ్ము మొదలైనవి పీల్చడంవల్ల అనేక విధాల అలెర్జీలు, శరీరం మీద దద్దుర్లు ఏర్పడుతున్నాయి. పారిశ్రామిక విషాలలో చాలా అపాయకరమైనవి—లెడ్, మెర్క్యూరీ ఆర్సెనిక్, క్రోమియం, కాడ్మియం మొదలైన లోహాలు, వాటి యౌగికాలు. వీటికంటే కొంచెం తక్కువ పరిమాణంలో ప్రమాదమైనవి మాంగనీసు, వెనేడియం, టెల్లూరియం, థాలియం, సెలెనియం, జింక్, నికెల్, రాగి, టిన్ మరియు వాటి యౌగికాలు.

నిరోధక చర్యలను అవలంబిస్తే పారిశ్రామిక కాలుష్యాలవల్ల అంతగా భయపడవలసిన అవసరం లేదు. వాస్తవానికి వాతావరణంలో ఉండే కార్బన్ డైయాక్సైడ్ (బొగ్గుపులుసు వాయువు) 5000 ppm ను మించితే ప్రమాదకరమే. కాబట్టి అపాయకరమైన పదార్థాలు వాతావరణంలో తక్కువ స్థాయిలో ఉన్నంతవరకూ వాటి అనర్థాలను కొంతవరకూ తట్టుకోవచ్చు.

పారిశ్రామిక కాలుష్యాల నియంత్రణ నిరోధం ఒక దేశంయొక్క వైజ్ఞానిక ప్రగతిని తెలియజేస్తుంది. రసాయనిక శాస్త్రవేత్తలు, ఇంజనీరులు, మీటియారలజిస్టులు, వైద్యులు, ఇతర నిపుణులు అందరు చేరి పారిశ్రామిక కాలుష్యాల నియంత్రణ నిరోధ

# మిమిక్రీలో అపూర్వ ప్రజ్ఞాశాలి



డా. నేరెళ్ళ వేణుమాధవ్ మిమిక్రీలోను, మోనో ఆక్షన్‌లోను ప్రపంచ ప్రసిద్ధిని పొందిన నిపుణుడు. ముఖ్యంగా ఆంగ్లేయ సాహిత్యం, సినిమాల నుంచి ఇతడు గ్రహించి ప్రదర్శించే ఏకపాత్రాభినయాలు వినడం శ్రోతలకు ఒక అపూర్వ అవకాశం. ఒథెల్లో పాత్ర అభినయించిన సుప్రసిద్ధ ఆంగ్లేయ నటుడు సర్ లారెన్స్ ఆలివర్‌ను స్ఫురింపజేస్తాడు భారతదేశంలోనే గాక విదేశాలలో కూడా డా వేణుమాధవ్ లక్షలాది ప్రేక్షకులను ఇంగ్లీషు, హిందీ, తెలుగు, ఉరుదు భాషలలో అభినయించి ముగ్ధులను చేసాడు. హైదరాబాదులోను, కౌలాలంపూర్‌లోను జరిగిన ప్రపంచ తెలుగు సమావేశాలలో గౌరవింపబడిన 'మిమిక్' ఇతడు ఒక్కడే.

నలకు చేపట్టవలసిన విధానాలను కనుగొని దానికి తగిన ఉద్యమాలు కొనసాగించాలి.

అనేక రసాయనిక పదార్థాలు వాతావరణంలో వాయువులుగా మండిపోతున్నాయి. తగిన జాగ్రత్తవహించి అత్యధిక రసాయనిక పదార్థాలు విరసాయకరమైన పదార్థాలుగా మండేటట్లు గమనించాలి. ఎలక్ట్రోడిపొజిషన్ వల్లగాని గాలి ఎక్కువగా ప్రసరింపజేయుట వల్లగాని, నీటి గొట్టపు బాయిలర్ల వల్లగాని మసిని గ్రహింపవచ్చు దుమ్ము చేరకుండా సైక్లోన్‌డస్ట్ సెపరేటర్లు, ఎలక్ట్రోస్టాటిక్ ప్రెసిపిటేటర్లు ఉన్నాయి.

విషవాయువులు, ఇతర వాయువులు, పొగలు మొదలైనవాటిని కొన్ని పదార్థాలు పీల్చుకుంటాయి. తగిన ఎబ్సార్బర్లను ఉపయోగించటంచేత ఇవి గాలిలో చేరడానికి అవకాశం ఉండదు. సోడియం హైడ్రాక్సైడ్ 90 శాతం సల్ఫర్ డయాక్సైడ్‌ను, హైడ్రోజన్ క్లోరైడ్‌ను పీల్చుకుంటుంది. ఇదేవిధంగా సోడియం కార్బనేటు హైడ్రోక్లోరిక్ ఆసిడ్‌ను హైడ్రోజను సైనైడ్‌ను, నైట్రోజన్ పెరాక్సైడ్‌ను పీల్చుకుంటుంది. పాదరసం, హైడ్రోజన్ సల్ఫైడులకు ఐడీను, క్లోరీన్‌కు పొటాషియం అయోడైడ్, ఫోస్‌జీన్‌కు బ్రోమిన్‌అనిలైన్, నైట్రిక్ ఆసిడ్‌కి బెంజీన్ ఉపయోగపడతాయి.

అపాయకరమైన ఈ పొగలు, వాయువుల ప్రభావాన్ని తగ్గించేందుకు పొడుగాటి చిమ్నీలను ఉపయోగించడం ఒక విధానం. పరిసర ప్రదేశాలలో ఉన్న ఇళ్ళ ఎత్తుకు సుమారు 2.5 రెట్లు అధికంగా ఉన్న పొడుగాటి చిమ్నీలను ఉపయోగించడం ఉత్తమం.

సాధారణంగా ఈ పారిశ్రామిక కాలుష్యాలను, విషపదార్థాలను విరోధించడానికి, నివారించడానికి అవలంబించవలసిన విధానాలు ముఖ్యంగా ఆయా పరిశ్రమలవల్ల ఏర్పడుతున్న కాలుష్యాలు, విషాలు, వాయువుల మీద, వాటి ప్రభావంమీద, పరిమాణం మీద ఆధారపడి ఉంటాయి. ●

## మిస్ యూనివర్స్




పోర్టో రికో సాన్‌జాన్‌కు చెందిన 19 సంవత్సరాల వయస్సుగల మిస్ డెబోరా కార్తీడియు (Deborah Carthy - Deu) అనే యూనివర్సిటీ విద్యార్థినిని ఇటీవల అమెరికా మియామీలో మిస్ యూనివర్స్‌గా కిరీటం పెట్టి గౌరవించారు. 5 అ. 8 అం. పొడవుగల ఈమె బరువు 118 పౌండ్లు.

---

"భగవంతునికి మిక్కిలి ప్రియమైన పువ్వులు ఎనిమిది: అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపస్సు, దానము, సత్యము."

# ప్రపంచ వార్తలు

## ఐస్‌లాండ్‌లో హాస్పిటల్ పడకలు :

ప్రపంచ ఆరోగ్యసంస్థ రిపోర్టు ప్రకారం పశ్చిమ అట్లాంటిక్ మహా సముద్రంలోని యూరప్ ద్వీపకల్పపు రిపబ్లిక్ ఐస్‌లాండ్‌లో హాస్పిటల్ పడకలు ఏ ఇతరదేశంలో కంటె అధికం_60 మందికి ఒకటి అని తేలింది.

* * *

## కన్‌ఫ్యూషియస్ 2535 వ జన్మదినం :

చైనాలోని షాన్‌డంగ్ ప్రాంతంలోని ఖుపులో వాద్యాలఘోషతో, ప్రాచీన పాటల గానంతో, నృత్యాలతో కన్‌ఫ్యూషియస్ స్వంత గృహంలో కన్‌ఫ్యూషియస్ (Confucius) 2535 వ జన్మదినం అతి వైభవంగా జరిపారు.

* * *

## ప్రత్యేకంగా సీలు చేయబడ్డ గదిలో రష్యా సైంటిస్టులు:

దీర్ఘకాలపు అంతరిక్ష జీవితాన్ని ఉత్తేజపరచుకోడానికి ఇద్దరు రష్యా సైంటిస్టులు 300 ఘనమీటర్ల సీలు చేసిన ప్రత్యేక గదిలో 5 నెలలపాటు గడిపారు. ఈ సైంటిస్టులు కృత్రిమంగా హరిత గృహాలలో పండించిన ఆహార ధాన్యాలమీద, ఇతర పంటల మీద జీవించారు. ఇటువంటి ప్రత్యేక అభ్యాసంవల్ల బయోస్ఫియరులో అనుకూలాలను లాభకరంగా వినియోగించుకుంటూ కాలుష్యాలను సాధ్యమైనంత వరకు తగ్గించుకుని దీర్ఘకాలం అంతరిక్షంలో ప్రయాణాలకు వీలవుతుందని ఆశిసున్నారు.

## మిక్కిలి పెద్ద హిమానీ నదము



అంటార్కిటిక్ ఖండంలో 200 చ.కి.మీ పెద్ద హిమానీ నదాన్ని (Iceberg) భారతీయ పరిశోధక బృందం కనుగొన్నారు.

"ఆడంబరము అపహాస్యమునకు దారి తీయును;
నిరాడంబరము నిర్మలత్వమునకు సోపానము"

## వలసల విధానాన్ని మందపరచే ప్రత్యామ్నాయ ప్రవృద్ధి కేంద్రాలు:

ఇంటర్నేషనల్ యూనియన్ లోకల్ అథారిటీస్ సెక్రటరీ జనరల్ జె. జీ. వాన్ పుటెన్ అభిప్రాయం ప్రకారం చిన్నతరహా మరియు మధ్యరకపు పట్టణాలను ప్రత్యామ్నాయ ప్రవృద్ధి కేంద్రాలుగా అభివృద్ధి పరచడంవల్ల గ్రామీణ ప్రదేశాలనుంచి పెద్ద పెద్ద నగరాలకు ప్రజలు వలసలు పోవడం మెల్లిగా తగ్గుతుంది.

* * *

## బంగ్లాదేశ్‌లో పసిబిడ్డలు అధికంగా మరణిస్తున్నారు:

గర్భ దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న బంగ్లాదేశ్ జనాభా 2000 నాటికి రెట్టింపు అవుతుంది. ప్రస్తుతం జనాభా 920 లక్షలు. ప్రతీ సంవత్సరం 38 లక్షల పిల్లలు పుడుతుంటే 15 లక్షల మంది జనం మరణిస్తున్నారు. ప్రతీ సంవత్సరం పెరిగే 23 లక్షల అదనపు మందికి ఆహారం పెట్టలేకపోతూంది. బంగ్లాదేశ్‌లో పసిపిల్లల మరణపు రేటు కూడా అధికమే. పుట్టిన 28 రోజులలో 40 శాతం పిల్లలు మరణిస్తున్నారు.

* * *

## పైతొడుగు లేని కణం:

జపానులో అగ్రో బయోలాజికల్ రిసోర్సెస్‌కు సంబంధించి జాతీయ సంస్థలో కణ పరిశోధకులు ప్రోటోప్లాస్ట్ నుంచి పైపొట్టు లేని కణాన్ని పునరుత్పాదించారు. ఇది ప్రపంచంలోనే ఘన విజయం మొక్కల ప్రవృద్ధికి మరియు ఇతర జీవ సాంకేతిక శాస్త్రాలకు ఇది చాలా అమూల్యమైనది.

* * *

(మిగతా 39 వ పేజీలో)

## 1,08,138 కాఫీ తోటలు



ఈనాడు భారతదేశంలోని కర్ణాటక, తమిళనాడు, కేరళ, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, ఈశాన్య ప్రదేశాలలో మొత్తం 2,26,848 హెక్టేరుల మేర కాఫీ పండించబడుతూంది. ఒక్కొక్కటి 10 హెక్టేరుల కంటె తక్కువైన మొత్తం 1,08,138 కాఫీ తోటలున్నాయి. చిన్న, పెద్ద కాఫీ తోటలలో మొత్తం 3,44,505 మంది రోజు కూలీలను వినియోగిస్తారు. ఇక్కడ ఉత్పత్తి అయే కాఫీలో 56,079 టన్నులు మన దేశంలోనే ఖర్చవుతూంది. 25 సంవత్సరాలలో కాఫీ ఎగుమతులు 15 రెట్లు పెరిగాయి ప్రపంచంలో 75కి పైబడిన దేశాలు ఇండియన్ కాఫీనే వాడుతున్నారు.

"సకల సంపదలు కలవాడు సాటి మనిషికి సహకరించకుండుట స్వార్థము."

# పునర్జన్మ నిజమా లేక కథా?

ప్రొ. బి. వి. కృష్ణమూర్తి

2

ఇటీవల జరిగిన ఒక విచారణలో తేలిన విషయాలు. ఒక వ్యక్తికి బాగా వత్తి ఉంది. ఆ వత్తిని కుదర్చడానికి పూనుకుని మనస్సుని మళ్ళించడానికి ప్రయత్నాలు జరుగుతుండగా ఉన్నట్టుండి ఆ వ్యక్తి గట్టిగా మూలగడం ప్రారంభించాడు. ఎందుకు మూలుగుతున్నావు అని అడిగినప్పుడు ఆ వ్యక్తి -

"అబ్బా! తుపాకీ పేల్చారు"

"ఎవరు?"

"వేటగాడు."

"ఎక్కడ ఉన్నావు నీవు?"

"నది మీద ఎగురుతున్నాను"

"నువ్వు ఎలా ఎగరగలవు?"

"ఎందుకు ఎగరలేను! నేను పక్షినేకదా" అంటూ మెల్లిమెల్లిగా ఆ వ్యక్తి కన్నడంతో అనర్గళంగా మాట్లాడడానికి ప్రారంభించాడు. అయితే కంఠం మారింది వయస్సు ఎంత అని ప్రశ్నించినప్పుడు "నాకు ఎనిమిదేళ్ళు" "నువ్వు బడికి వెళుతున్నావా?" అని అడిగినప్పుడు "నేను ఎలా వెళ్ళగలను? కాళ్ళు లేవు మరి"

కొంతసేపటికి ఇంకా కొంచెం ముందుకు మళ్ళించినప్పుడు సన్నగా మూలుగుతూ ఏడవడం ప్రారంభించాడు. 'ఏం జరిగింది?' అని అడగ్గా 'అబ్బ జ్వరంగా ఉంది' అన్నాడు. రాను రాను జ్వరం ఉధృతమైంది. తాను మరణించి తిరిగి బ్రతికానని చెప్పాడు. అతడు చెప్పిన ప్రకారం ఈ పుట్టుక దక్షిణ కర్ణాటకలో జరిగిందట. రాధా ప్రకారం ఆ వ్యక్తి తిరిగి న తితో. మాటా

## సోబర్స్ రికార్డును అందుకున్న రవిశాస్త్రి



బొంబాయి, బరోడా రంజీట్రోఫీ మాచ్‌లో 22 సంవత్సరాల ఆల్ రౌండర్ రవిశాస్త్రి ఒక్క ఓవర్‌లోనే ఆరుసార్లు ఆరు పరుగులు చేసి 16 సం॥నాటి వెస్ట్ ఇండీస్ ఆటగాడు గార్‌ఫీల్డ్ సోబర్స్ రికార్డును అందుకున్నాడు.

"ఇహలోక న్యాయాధీశుని కన్నుగప్పవచ్చునుగాని,
పరలోక న్యాయాధీశుని కన్నుగప్పుట కల్ల."

దరం ప్రారంభించారు.

రెండవసారి విచారణకు కూర్చున్నప్పుడు ఇదివరకటి కంటే ఇంకా ముందుకు కుంటిగా ఉన్న స్థితిలోకి మళ్ళించబడ్డాడు. ఈసారి ఆ వ్యక్తి హిందీలో మాట్లాడటం ప్రారంభించాడు. తను సంయుక్త రాష్ట్రాలు (ఇప్పుడు ఉత్తరప్రదేశ్) రాంపూర్‌లో జన్మించినట్టు చెప్పాడు. తనతోపాటు తన తమ్ముడు కూడా ఉన్నట్టు, తనకు అప్పుడు నత్తి ఉన్నట్లు చెప్పగలిగాడు

ఈసారి ఇంకా ముందు జన్మకు మళ్ళించబడ్డాడు. ఇంగ్లీషులో చెప్పడం మొదలు పెట్టాడు. ఆక్స్‌ఫర్డ్ (ఇంగ్లండు)లో పుట్టినట్లు యూనివర్శిటీలో ఎమ్ ఎస్. సికి చదువుతున్నట్టు చెప్పాడు. అప్పుడు కూడా అతడికి నత్తి ఉంది.

దేహాంతర ప్రాప్తి అంటే జీవుడు లేక ఆత్మ ఒక దేహాన్ని విడిచి జంతువుగానో, పక్షిగానో పుట్టడం. పైన జరిగిన పరిశోధనలో వ్యక్తి పక్షిగా పుట్టినట్లు చెప్పాడు. ఇంతకంటె మరీ ఆశ్చర్యకరమైన విషయం-ఎడ్గెర్ కెయిస్ అనే వ్యక్తికి ఒక అపూర్వ శక్తి ఉంది. తనంత తనే నిద్రలోకి మనస్సును మళ్ళించుకుని ఆ అవస్థలో వెనుకటి డాక్టరు జన్మలోకి వెళ్ళిపోయి రోగులను పరీక్షించి చికిత్సకు మందులు ఔషధాలు చెప్పగలిగేవాడు. (థామస్ సుగ్రూ వ్రాసిన ఎడ్గెర్ కెయిస్, డెల్ ప్రచురణ). కెయిస్ చదువు సంధ్యలు లేని సాధారణ వ్యక్తి. 20 వ శతాబ్దం మొదటి భాగంలో జీవించాడు. ఇక్కడ అన్నిటికంటె వింతగా కనిపించే విషయం రోగి ప్రత్యక్షంగా ఉంతక్కర లేదు. రోగి వివరాలు, ఎడ్రసు ఇస్తే చాలు. కెయిస్ మానసికంగా రోగి దగ్గరకు వెళ్ళి రోగిని పరీక్షించి రోగం తెలుసుకుని దానికి తగిన చికిత్సా విధానం, కావలసిన ఔషధాలు చెప్పేవాడు. కొన్ని కొన్ని విష

## చాట్స్‌వర్త్ దేవాలయం



దక్షిణ ఆఫ్రికా చాట్స్‌వర్త్‌లో హరేకృష్ణ భక్తులు అక్కడ ఒక కోటి రూపాయల వ్యయంతో నిర్మించబడిన దేవాలయానికి ఈ సంవత్సరం అక్టోబరు 20 వ తేదీన ప్రారంభోత్సవం చేసారు. ఈ అధునాతన దేవాలయం హాలులో ధారాళంగా 1500 మంది భక్తులు కూర్చోడానికి అవకాశం ఉంది. ఎవర్ సిల్వర్‌తో పోతపోసిన దీని పైకప్పు అష్టభుజాకారంలో ఉంటుంది. దీనికి 435 రంగు రంగుల కిటికీలు అమర్చబడ్డాయి. లోపల వెలుతురు కోసం దేవాలయానికి నాలుగు ప్రక్కల స్వర్ణమయ కాంతి విచ్చే గాజు పలకలు కూడా అమర్చారు.

"మతం అంటే మానవుని మనస్సుకు శాంతినిచ్చే మార్గం." —అమ్మ

యాలలో కచ్చితంగా చెప్పేసేవాడు. "ఈ రోగానికి చికిత్స లేదు. వెనుక జన్మలో చేసిన పాపకార్యం అనుభవించాలి అని." కెయిస్‌లో ఉన్న ఈ శక్తిని చూచి "అతడి బంధువులకు. స్నేహితులకు ఎంతో ఆశ్చర్య మైంది. అనేకమంది పునర్జన్మల గురించి ఇతడు వెల్లడి చేయగలిగాడు.

ఈ జన్మలో వెనుకటి జన్మ విశేషాలు వర్ణించడం. గత జన్మ జ్ఞాపకాలు చెప్పడం ఆశ్చర్యమే. సైన్సును ఎవరూ కాదనలేక పోయినప్పటికీ పునర్జన్మల గురించి, దేహాంతర ప్రాప్తి గురించి వస్తున్న అనేక ఉదంతాలు శాస్త్రజ్ఞులకు సహితం అర్థం కావడం లేదు. ఒక్క మన దేశంలోనే కాదు ప్రపంచం అన్ని మూలలనుంచి ఈ పునర్జన్మ సిద్ధాంతాన్ని గురించిన కథలు వెలుగులోనికి వస్తున్నాయి. ఇప్పటికీ ప్రపంచం అంతటా అనేక పరిశోధనా సంస్థలలో పునర్జన్మ మరియు దేహాంతర ప్రాప్తి సిద్ధాంతాలను బలపరచడానికి అనేక పరిశోధనలు చేస్తున్నారు.

మనం కళ్ళారా చూస్తున్న ఈ విజాలకు శాస్త్రీయ విజ్ఞానానికి ఎలా పొసుగుతుందో ఎలా పరిణమిస్తుందో! అసలు పునర్జన్మ ఉందా? దీనిని గురించి విపరంగా తెలుసుకోవాలంటే జీనా సెర్మినారా రచించిన 'ది వరల్డ్ విథిన్' (The world within). 'మెనీ మేన్‌షన్స్' (Many mansions) అనే రెండు గ్రంథాలు చదవవచ్చు. ఇవి విలియమ్ స్లోయేన్ అసోసియేట్స్, న్యూయార్క్, అమెరికా (William sloane associates, New york, U. S. A.) వారిచే ముద్రింపబడినవి.

## 450 సంవత్సరాల నాటి కోకో



చాక్‌లెట్లు తయారుచేసే కోకో, కోకో చెట్లనుండి లభిస్తుంది. ఈ చెట్లు మొట్ట మొదట మధ్య అమెరికా ఉష్ణ ప్రదేశాలలో మాత్రమే పెరిగేవి. కాని ఇప్పుడు ప్రపంచానికి సగానికి సగం కోకోను పశ్చిమ ఆఫ్రికా సరఫరా చేస్తుంది. కోకో చెట్లు సంవత్సరం పొడుగునా పండుతాయి. సరాసరి ఒక సంవత్సరానికి ఒక కోకో చెట్టునుంచి లభ్యమయ్యే కోకో గింజలనుండి 2 పౌనుల కోకో ఉత్పత్తి అవుతుంది.

450 సం లకు పూర్వం మెక్సికోలో నివసించే అజ్‌టెక్స్ (AZTECS) మొట్ట మొదట కోకోలో వనిల్లా కలుపుకునో, సువాసన ద్రవ్యాలు కలుపుకొనో త్రాగేవారు. అ తరువాత 16వ శతాబ్దంలో స్పానిష్ సైనికులు యూరప్‌లో దీనిని ప్రవేశపెట్టారు.

13వ శతాబ్దానికి బ్రిటన్‌లో ఎక్కడ చూచినా కోకో హౌసులు బయలుదేరాయి. కోకో పానీయానికి గిరాకీ ఎక్కువైంది.

"గడుసైన పెనుమొద్దు గాలికి వెరవునా, విరుగ గాచినమ్రాను వెలయుగాక."

# రాకెట్ల కథ

రాఘవేంద్రరావు

రష్యా అక్టోబరు 4, 1957 న స్ఫుట్నిక్-I ను వదలినప్పుడు భూమిమీద అంతరిక్ష యుగం ప్రారంభమైందని ఎవ్వరూ అనుకోలేదు. రష్యాదేశపు విజ్ఞాన శాస్త్రవేత్త సెర్గీ కొరా



లెవ్ అభివృద్ధిపరచిన శక్తివంతమైన రాకెట్తో 84 కి.గ్రా. తూగే ప్రపంచపు తొలి కృత్రిమ ఉపగ్రహం విడువబడింది.

రాకెట్లు ఒక నూతన కల్పన కాదు. పూర్వం 1042 A.D. లో చైనా దేశస్థుడైన ట్సెంగ్ కుంగ్ లియాంగ్ బొగ్గు, గంధకము కలిపిన తుపాకీ మందును చోదకశక్తిగా యుద్ధాలలో 'ఫ్లేమింగ్ ఆరోస్' (flaming arrows) అనే రాకెట్లు వదలినట్లు వివరించాడు. 1242 ఏ సం. లో కై పుంగ్-పు పై దండెత్తి వచ్చిన మంగోలులను ఎదిరించడానికి చైనీయులు వీటిని వాడారు.

13 వ శతాబ్దం నాటికి రాకెట్ విజ్ఞాన యూరపుకు ప్రాకింది. ఆనాటి మం యుద్ధాలలోను, ముట్టడులలోను రాకెట్ల ఉ యోగం వాడకలో ఉంది. చివరగా 1687 సం. లో సర్ ఐజాక్ న్యూటన్ రాకెట్లన రూపొందించడానికి మౌలిక సూత్రాలను వి

## సుభాషితాలు

విన్నవానికన్న కన్నవాడధికుండు
కన్నవానికన్న గలియువాడు
ఉన్నతోన్నతుడయి యుర్విలోపలనుండు
విశ్వదాభిరామ వినురవేమ!

(భగవంతుని గురించి వినినవాడి కంటె పరమాత్ముని చూచినవాడు గొప్పవాడు దేమునితో ఐక్యం పొందినవాడు గొప వారందరికంటే గొప్పవాడు.)

* * *

రాతి బొమ్మకేల రంగైన పలువలు?
గుళ్ళు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుండు?
విశ్వదాభిరామ వినురవేమ!

(రాతి విగ్రహాలకు పెద్ద పెద్ద పట్టుబట్ట కట్టడం ఎందుకు? దేవుడు తిండిబట్ట గుళ్ళ గోపురాలు కోరడు.)

"'మంచి' అనేది మానసికమేకాని వస్తుసమూహానికి చెందినది కాదు."

౦చారు.

యు 1799 వ సం.లో బ్రిటిషు వారిపై జరిపిన రో ౦సూరు యుద్ధాలలో టిప్పుసుల్తాను రాకెట్ చే ను ఉపయోగించారు. వెదురుబెత్తాలకు కె మర్చిన ఈ రాకెట్లు 1¼ కి మీ. దూరంవరకు కి వంతంగా పయనించేవి. ఆ సమయంలో బ్రిటిషువారు ఈ రాకెట్లను గొప్ప మార ణాయుధాలుగా గ్రహించారు.

1804 వ సం.లో విలియం కాంగ్రీవ్ నే ఆంగ్లేయుడు 'రాకెట్ల పుట్టుక విధానం, ృద్ధి ప్రవృద్ధి' (A Concise Account of ie Origin and Progress of the ocket Sytem) అనే గ్రంథాన్ని ప్రచు ంచారు. ఇతడు తయారుచేసిన రాకెట్లు 2 మీ. దూరం వరకు ప్రయాణం చేస్తాయి. 814 వ సం లో ఆంగ్లేయుల బాల్టిమోర్ అమెరికా)లోని ఫోర్ట్ మెక్‌హెన్రీ ముట్టడిని ఎరించి అమెరికా జాతీయ గీతంలో 'ది ాకెట్ రెడ్‌గ్లేర్' (The Rocket Red Glare) ప్రసక్తి ఉంది.

ఆ తరువాత తీవ్రంగా రాకెట్ విజ్ఞానం ఎద కృషిచేసిన వారు రష్యా పాఠశాలా ుపాధ్యాయుడు, రాకెట్‌కి ఆద్యుడు అని ెప్పదగిన కాన్‌స్టాంటిన్ ట్సియోల్కొవిస్కీ 1857-1935). ఈయన రచనలలో తొలి చన ఫ్రీస్పేస్ (Free Space) 1883 వ ం. లో ప్రచురింపబడింది.

రాకెట్ విజ్ఞానంలో మొదటిసారిగా క్కువ కృషిచేసినది 1919 సం. లో . రాబర్ట్ హట్‌చింగ్స్ గొడ్డార్డ్. ఇతడు 'అంతరిక్షంలో పై ఎత్తులకు చేరే విధానం' (A Method of Reaching Extreme Altitudes) అనే గ్రంథాన్ని ప్రచురించి,

---

## భూటాన్ అడవి ఎద్దు



మధ్య ఆసియాలో కనిపించే యాక్ (అడవి ఎద్దులు) నేపాలు, సిక్కిం, భూటాన్‌లో కూడా ఉన్నాయి. వీటి శరీరం మీద ఒత్తుగా నిడివిగా ఉండే బొచ్చు వీటికి 16,000 అడుగుల మంచు పీఠభూమి మీది శీతల వాయువుల నుంచి రక్షనిస్తాయి. సుమారు 14 అడుగుల పొడవుగల దీని ముందుభాగం 6 అడుగుల ఎత్తుగా ఉంటుంది. వంపుగా ఉండే దీని కొమ్ములు 3 అడుగుల పొడవు. ఇచ్చట ముఖ్య ప్రయాణసాధనంగా ఉపయోగపడే ఈ యాక్ సమృద్ధిగా పాలను ఇస్తాయి. దీని మాంసం కూడా తింటారు. బొచ్చుతో బట్టలునేస్తారు. తోలు గుడారాలకు, బూట్లు తయారీకి ఉపయోగపడుతుంది. పేడ పిడకలు చేసి ఉపయోగించుకుంటారు.

"తనకు ప్రపంచంలో తెలియని విషయం లేదని
డాబులు పలికేటంతటి మూర్ఖుడు మరొకడుండడు."

మానవుడు చంద్రమండలాన్ని చేరవచ్చని సూచించాడు. ఆ నాడు అమెరికాలోని 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక 'చంద్ర మండలంలోకి రాకెట్' అనే శీర్షిక క్రింద ఈ వార్తను ప్రకటించింది. డా గొడ్డార్డ్ రాకెట్ల మీద తీవ్రంగా పరిశోధనలు కావించి ద్రవ రూపమైన ఇంధన సహాయంతో రాకెట్లను అభివృద్ధిపరచి, మార్చి 16, 1926లో అమెరికా మసాచుసెట్స్ ఆబర్న్‌లో దీన్ని విజయ వంతంగా వదలాడు. ఈ రాకెట్ 12.5 మీ. (41 అ) ఎత్తుగా 56 మీ. (184 అ.) దూరం ప్రయాణం చేసింది. ఇంతలో యూరపులో కూడా దీని ప్రవృద్ధికి మిక్కిలి అసక్తిని ప్రదర్శించారు హెర్మన్ ఓబెర్త్ వంటి రచయితలు మరికొందరు అంతరిక్ష శాస్త్ర అభిమానులు చేరి 'అంతరిక్ష ప్రయాణ సంఘం' (Society for Space Travel) 1927 వ సం.లో స్థాపించారు. దీనిలో సుప్రసిద్ధ వెర్న్‌హెర్ వాన్ బ్రాన్ ముఖ్యుడు. ఇతడే తరువాత అమెరికా అంతరిక్ష ప్రణాళికను సిద్ధపరచాడు.

యూరపులో ద్రవరూపపు ఇంధనంతో తొలి రాకెట్ మార్చి 14, 1931 లో జోహన్నెస్ విన్క్లర్ సాధించాడు. విజయవంతమైన ఈ సాహసాన్ని చూచి జర్మనీ పై నిక అధికారులలో కుతూహలం, జిజ్ఞాస బయలు దేరింది. ముఖ్యంగా కల్నెల్ డార్న్ బెర్గెర్ రెండవ ప్రపంచ యుద్ధానికి ముందే జర్మను రాకెట్ ప్రవృద్ధికి పూనుకొని నాయకత్వాన్ని వహించాడు.

రాకెట్ శక్తివంతమైన ఆయుధంగా ప్రవృద్ధి చేసినది జర్మనులే. డార్న్ బెర్గెర్ బృందం వెర్న్‌హెర్ వాన్‌బ్రాన్ 1942 లో

## మొట్టమొదట గొడుగు పట్టిన వ్యక్తి హాన్‌వే



జొనాస్ హాన్‌వే (1712-1786) మొట్ట మొదట గొడుగు విప్పినప్పుడు ఆడదానిలా గొడుగు పట్టుకున్నాడని జనం నవ్వారు. ఎగతాళి చేసారు. రాళ్ళు రువ్వారు.. కోడిగ్రుడ్లు విసిరికొట్టారు.

ఈ నాడు గొడుగు మనకు ఎండకూ వానకూ రక్ష. కొంతమందికి చేతికర్రగా ఉపయోగిస్తుంది. రోజూ చేతిలో గొడుగు పట్టుకునేవారు ఒక రోజు తెచ్చుకోకపోతే అసలు ఆనవాలు పట్టలేం. ఉదాహరణకు బ్రిటిష్ ముఖ్యమంత్రి నెవెల్లి చాంబర్లిన్ (1937-40). గొడుగులు సాధారణంగా పోతూ ఉండటం సహజం. ఆంగ్ల భాషలో దీనికి 'అంబ్రెల్లా మోరల్స్' అనే మాట కూడా ఏర్పడింది. ఈ మాటకు అర్థం వేరొకరి గొడుగు మతిమరుపుతో తీసుకొని పోవడం

...లపి సిద్ధపరచిన రాకెట్ 200 కి.మీ. దూరం ప్రయాణశక్తిగలిగింది. దీనినే $V_2$ రాకెట్‌గా మరింత అభివృద్ధిపరచారు.

ఇథైల్ ఆల్కహాల్ మరియు ద్రవ రూపంలో ప్రాణవాయువు ఇంధనంగా ఉపయోగించి వాడిన మొట్టమొదటి $V_2$ మారణాయుధం జూలై 1944 లో విడువబడింది. ఆతరువాత యుద్ధంలో జర్మనులు 4,000 వరకు $V_2$ రాకెట్‌లను ఉపయోగించి బ్రిటీషు వారికి చాలా నష్టం కలుగచేశారు.

1945 సం॥ యుద్ధంలో జర్మనులు లొంగిపోయినప్పుడు వెర్నెహెర్‌వాన్‌బ్రాన్ ఇంకా చాలామంది విపుణులు అమెరికాకు లొంగిపోయారు. వీరు అమెరికాలో సైన్యం ఉపయోగానికి రాకెట్ల అభివృద్ధిని తీవ్రంగా కొనసాగించారు.

మొట్ట మొదట మానవుడు రాకెట్ సహాయంతో చంద్రమండలానికి వెళ్ళాలనే అభిప్రాయంతోనే రాకెట్ ప్రారంభింపబడింది. అపోలో లూనార్ మిషన్సుకుగాను అభివృద్ధిపరచి నిర్మించిన సాటర్న్-V ప్రపంచంలో అతి శక్తివంతమైన పెద్ద రాకెట్. అట్లాస్, థోర్, టిటాన్ రాకెట్లలా కాక సాటర్న్ రాకెట్లు ప్రత్యేకంగా మిలటరీ ఉపయోగాలకు కాకుండా ప్రజల శాంతియుత ప్రయోజనాలకు నిర్మించబడింది.

రాకెట్ యుగంలో మొదటి 25 సంవత్సరాలు అంతరిక్షయానంలో అమెరికా, రష్యాల పోటీ అని చెప్పవచ్చు. ఈ పోటీ 1965 వరకూ సాగింది. 1965 లో ఫ్రాన్సు స్వంతంగా ఉపగ్రహాన్ని వదిలే రాకెట్‌ను అభివృద్ధి చేయడానికి ప్రారంభించింది. ఆ సంవత్సరం నవంబరు 28 న ఫ్రెంచి

## బాల గంధర్వుడు



14 సంవత్సరాల వయస్సు గల మాండొలిన్ శ్రీనివాస్ పాశ్చాత్య వాద్యం మాండొలిన్ మీద కర్ణాటక సంగీతాన్ని అపూర్వంగా వాయించగల సాహసికుడు. ఈతడు ఆంధ్ర ప్రదేశ్ పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు గ్రామానికి చెందినవాడు.

11 సం.ల వయస్సులోనే 1981 ఆంధ్ర ప్రదేశ్ త్యాగరాజ ఆరాధన మహోత్సవాలలో ఇతడు తన తొలి ప్రదర్శనము కావించి ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేశాడు. ఆనాటి నుండి అనేక ప్రదేశాలలో తన కళా నైపుణ్యాన్ని ప్రదర్శించి అనేకమందిని ముగ్ధులను కావించాడు. 1984 లో తమిళ నాడు ప్రభుత్వం శ్రీనివాస్‌ని స్థానిక ప్రభుత్వ కళాకారునిగా నియమించి గౌరవించింది. 1985 శ్రీ రాజలక్ష్మి అవార్డు (రూ. 15,000)ను గ్రహించిన అభినవ బాల గంధర్వుడు మాండొలిన్ శ్రీనివాస్.

"జగజ్జేతేశ్వరుల ఐక్యబుద్ధియే సమాధి."

శాస్త్రజ్ఞులు 88 కి. మీ. తూగే కృత్రిమ ఉపగ్రహాన్ని డైమంట్ (Diamant) రాకెట్ సహాయంతో అంతరిక్ష కక్ష్యలోకి పంపారు.



తరువాత జపానువారు 'లాంబ్డా' (Lambda) రాకెట్‌లో చిన్న కృత్రిమ గ్రహాన్ని అమర్చి ఫిబ్రవరి 11, 1970 లో కక్ష్యలోకి దింపారు. మూడునెలల అనంతరం చైనా వారు కూడా రాకెట్‌ను ప్రయోగించారు. అక్టోబరు 28, 1971 లో బ్రిటిషువారి 'బ్లాక్ ఆరో' (Black Arrow) రాకెట్ 'ప్రాస్పెరో' (Praspero) అనే కృత్రిమ ఉపగ్రహాన్ని కక్ష్యలోకి దింపింది.

జూలై 18, 1980 లో భారతదేశంకూడా అంతరిక్ష పరిశోధక సంఘంలో సభ్యులుగా చేరి భారతీయులు రూపొందించిన SLV-3 రాకెట్ సహాయంతో 35 కి.గ్రా. రోహిణి ఉపగ్రహాన్ని కక్ష్యలోకి వదలారు.

ఇండియన్ స్పేస్ రీసెర్చి ఆర్గనైజేషన్ (ISRO) 1963 లో తిరువనంతపురం తుంబాలో ఏర్పాటైంది. కొద్దిమందితో ప్రారంభింపబడిన ISRO ఇప్పుడు బాగా అభివృద్ధి పొందింది. తిరువనంతపురం విక్రమ్ సారభాయి స్పేస్ (VSSC) కేంద్రంలోను, శ్రీహరికోట (SHAR) కేంద్రంలోను, బెంగుళూరు ISRO కృత్రిమ ఉపగ్రహ కేంద్రం (ISAC) లోను, అహమ్మదాబాదు స్పేస్ అప్లికేషన్ కేంద్రం (SAC) లోను నేడు మొత్తం 10,000 మందికి పైగా స్త్రీలు, పురుషులు ఉద్యోగాలు చేస్తున్నారు.

అనేక వందల కిలోమీటర్ల ఎత్తుగా అంతరిక్షంలోకి వదలిన ఉపగ్రహాలు భూమిమీంది మానవుని జీవితంలో అనేక విధాలుగా ఉపయోగపడుతున్నాయి. ఖండాంతర వార్తా ప్రసారం జరుగుతూంది. భూ సాధన సంపత్తులు, వాతావరణం సూచనలు మొదలైనవి తెలుసుకోగలుగుతున్నాము. 1957 అక్టోబరు నుంచి ఈ రంగంలో ఎన్నెన్నో మార్పులు ఏర్పడ్డాయి. రాబోయే 25 సంవత్సరాలలో ఈ రాకెట్ విజ్ఞానం ఎంతో అభివృద్ధి కానున్నది. ●

---

(31 వ పేజీ తరువాయి)

## చైనా గ్రేట్‌వాల్ 16 శాతం మాత్రమే భద్రంగా ఉంది:

శత్రుసైన్యాలు దాడి చేయకుండా చైనా చక్రవర్తులు నిర్మించుకు వచ్చిన చైనా గ్రేట్ వాల్ కూలిపోతూంది. ఉత్తరబీజింగ్‌లో 6,000 కి.మీ. పొడవైన గోడను విమానం మీదనుంచి పరిశోధించి చూడగా 16 శాతం గోడ మాత్రమే భద్రంగా ఉన్నట్టు తెలుసు

---

"అజ్ఞానము, అలసత్వము, జడత్వము, నిదుర, అజాగ్రత్త తమోగుణాలు."

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.]

1. డి. రాజ్ కుమార్, 5 ఏరియా, ఇం. నెం. 1154, గౌతంపూర్, కొత్తగూడెం తాలూకా, (ఖమ్మం జిల్లా) 507 138.

విజ్ఞానదాయకమైన పుస్తకాలు చదవడం, సినిమాలు చూడడం, కలంస్నేహం.

2. షేక్ జలీల్ అహమ్మద్. బి.కాం, ఎ. పి. ఎస్ ఆర్ టి సి కండక్టర్, ఇం. నెం. 8-4-345, నిజాంపేట్ స్ట్రీట్, ఖమ్మం 507 001.

రేడియో కార్యక్రమాల్లో పాల్గొనడం, పత్రికలు చదవడం, కలం స్నేహం.

3. మొర వెంకటరమణ, 19 సం॥లు. బి. ఎస్సి, రుమ్ నెం. 6-1-81/ఎ, చింతకుంటవాడ, నిర్మల్-504 106.

పెయింటింగ్, కార్టూన్లు వేయడం, కలం స్నేహం.

4. ఎమ్. యూసఫ్. టీచరు, C/o ఆశానిలయం, ఇం నెం. 1615, 5 ఇంక్లైన్స్, గోదావరిఖని-505 209.

స్నేహం, విజ్ఞానదాయకమైన పుస్తకాలు చదవడం, చిరునవ్వుతో ఉండేవారంటే ఇష్టం.

5. టి. రామదాస్, ఇంటి నెంబరు, 6-18-112, ఆదర్శ నగర్ కాలనీ, దుబ్బా, నిజామాబాద్-503 002.

కలం స్నేహం, సినిమాలు చూడడం, తోటివారితో కలసి ఉండటం.

## ఉల్లి చేసే మేలు



మానవుడికి ఒక ఔన్సు పచ్చి ఉల్లి పాయలరసంలో 7 క్యాలరీల శక్తి, 1.5 గ్రా. కార్బో హైడ్రేటులు, 0.3 గ్రా. ప్రోటీనులు, అతి కొద్దిగా క్రొవ్వు పదార్థాలు పొటాషియం. బి. సి విటమినులు లభిస్తాయి.

"మూర్ఖుడైనా, పండితుడైనా జ్ఞానసంపాదనయందు ఆసక్తి గలవారు పూజ్యులు."

# నదులకు రాజు-మొసలి

మొసళ్ళు ఇతర సరీసృపాల కంటే ఎక్కువ తెలివిగా ప్రవర్తిస్తాయి. వీటి జీవిత



విధానమే ఒక ప్రత్యేకతను కలిగి ఉంటుంది. మొసలి సంఘజీవి. గుంపులు, గుంపులుగా సంచరిస్తాయి. ఒంటరిగా ఆహారాన్ని తినవు. వేటలకు ఒంటరిగా వెళ్ళవు. వీటి గట్లమీద ఎండకు అన్నీ కలిసి చేరుతాయి. ప్రతీ సంవత్సరం ఆడజాతి మొసళ్ళు అంతకు ముందు పెట్టిన ప్రదేశంలోనే పిల్లలను పెట్టి పెంచడానికి బయలుదేరతాయి.

మొసలిజాతిలో ప్రతీ మొసలికి తాము నివసించే ప్రదేశం మీద హక్కు కలిగి ఉంటుంది. వ్యక్తిగతంగా ఈ హక్కును మొసళ్ళు సంరక్షించుకుంటాయి. శాంతిభద్రతల కోసం పెద్దమొసళ్ళు పిల్లమొసళ్ళు యవ్వనంలో ఉన్న మొసళ్ళు కలసి ఉండవు. వేటికవి విడివిడిగా నివసిసాయి.

సాధారణంగా మొసళ్ళు రక రకాల కంఠ స్వరాలతో మాట్లాడుకుంటాయి. చిన్న చిన్న మొసళ్ళు సన్నగా అరుస్తాయి. పెద్ద పెద్ద మగ మొసళ్ళు గట్టిగా మొరుగుతాయి.

వీటి నోటిలో వల ఆకారంలో పళ్ళు ఉంటాయి. ఈ పళ్ళ సహాయంతో జంతువుల కాలుగాని, ముట్టెగాని గట్టిగా పట్టిన పట్టు వీడకుండా నీళ్ళలోకి ఈడ్చి ముంచి చంపేస్తుంది. మొసలి తోకతో బలంగా కొట్టి జంతువులను చంపుతుందనే అభిప్రాయం నిజం కాదు.

ఈజిప్టు నైలునదిలో నివసించే మొసలి ముఖ్యంగా నదీసంబంధమైన జీవసంపత్తును సంరక్షిస్తాయి. నదులలో నివసించే బార్బెల్ అనే మిక్కిలి పెద్ద మంచినీటి చేపలను, వీటి జంతువులను తింటాయి. బార్బెల్ చేపలు విస్తారంగా పెరిగిపోతే వీటి పక్షులకు, ఇతర మత్స్యాహారులకు అసలు ఆహారమే దొరకదు. మొసళ్ళు నదీజలాలలో మురికినీటినిగాని, మృతకళేబరాలను గాని చేరనీయవు. నదీ ప్రవాహాన్ని శుభ్రంగా ఉంచుతాయి. అడవులకు సింహం లాగే నదులకు మొసలి రాజా వంటిది. రెండూకూడా ప్రకృతిలో సమతాస్థితి సంరక్షిసాయి.

"అంధుడు సూర్యోదయాన్ని చూడలేనట్లు, జ్ఞానచక్షువులు లేనివాడు సర్వ పరిపూర్ణ బ్రహ్మాన్ని చూడలేడు."

# చర్మము-దాని సంరక్షణ

డాక్టర్ ఎమ్. నటరాజన్

ముఖానికి ముక్కు అందమిస్తే దేహానికి రూపసౌందర్యాన్ని ఇచ్చేది చర్మం. దేహానికి చర్మపు తొడుగు లేకపోతే దేహం వికృతంగా, భయంకరంగా ఉంటుంది. శరీ రాంగాలలో చర్మం అతి ముఖ్యమైన పాత్ర



వహిస్తుంది: శరీరానికి బాహ్యంగంగా ఉంటూ, దేహాన్ని కప్పి సంరక్షించే చర్మం మిగిలిన అంగాలకంటే అతి విస్తారంగా ఉంటుంది. దీని విస్తీర్ణం సుమారు 181 చదరపు సెంటీమీటర్లు: తూకం 4 2 కి. గ్రా. లు. మొత్తం శరీరం తూకంలో ఇది 6 శాతం.

చర్మం సాధారణంగా నలుపు, ఎరుపు, గోధుమ ఛాయలలో ఉంటుంది. చర్మంలో ఉండే వర్ణధాతువులే దీనికి కారణం. ఈ వర్ణ ధాతువులు మెలనిన్, మెలనాయ్డ్, కెరాటిన్, ధమనుల ఎర్రని ఎరుపు, సిరల నలుపుతో కూడిన ఎరుపు మొత్తం ఐదు ఈ వర్ణ ధాతువులు వివిధ ప్రమాణాలతో సంయోజనం పొందుతుండటంవల్ల చర్మానికి వివిధ ఛాయలు ఏర్పడుతున్నాయి.

చర్మం సాధారణంగా 2. మి.మీ. దళసరిగా ఉంటుంది. బాహ్యంగా రాపిడి అధికంగా ఉండే శరీరభాగాలు - అరచేతులమీద, అరికాళ్ళ మీద చర్మం దళసరి ఎక్కువగా ఉంటుంది. ఇతర భాగాల మీద అంత దళసరిగా ఉండదు. కంటి గుడ్డుమీద రెప్పల చర్మం చాలా పలచగా ఉంటుంది.

ప్రతి చదరపు సెం.మీ. చర్మంలోను సామాన్యంగా అనేక వందల తైలగ్రంథులు,

---

## 66 శాతం జపానీయులు సంతుష్టులు

జపాను ప్రభుత్వం జరిపిన ఒక సర్వేలో తమ రాజ్యాంగంలో ప్రజలు 66 శాతం జీవిత విధానంలో ఏ లోటు లేకుండా సంతుష్టిగా, హాయిగా జీవిస్తున్నట్లు తేలింది. జపానీయుల జీవిత విధానంలో అసంతృప్తి పొందినవారి సంఖ్య 3 శాతం తగ్గింది.

---

"కాకి కలకాలం జీవించినా రాజహంసము కాజాలదు. అసత్తులో వెయ్యి సంవత్సరాలు జీవించడం కన్నా సత్తులో ఒక్కనాడు జీవించిన చాలును."

స్వేదగ్రంథులు, నరాగ్రాలు, సూక్ష్మ రక్తనాళాలు ఉంటాయి. చర్మానికి రెండు పొరలుంటాయి పైపొర ఎపిడెర్మిస్ (epidermis), లోపలి పొర. నిజమైన చర్మం



కోరియం (corium). భూతద్దం పెట్టి చూస్తే చర్మం పైపొరమీద ఎత్తుపల్లాలు గీతలు గీతలుగా కనిపిస్తాయి. మన వ్రేళ్ళ మీద కనిపించే గీతలు పుట్టినప్పటినుంచి మరణించేదాకా మార్పు లేకుండా ఉంటాయి. ఈ గీతలు ఏ ఇద్దరు వ్యక్తులకు సమానంగా ఉండవు. ఎవరి గీతలు వారికి ప్రత్యేకంగా ఉంటాయి. అందుకే అపరాధపరిశోధనలో ఇవి ముఖ్యపాత్రను వహిస్తాయి.

దేహపరిణామ ప్రక్రియలలో చర్మం ప్రత్యేకంగా ఎంతో ముఖ్యపాత్రను వహిస్తుంది. ఇది శరీరంలో అవయవ సమూహానికి, దేహానికి రక్షణగా ఉంది దేహంలో ఉష్ణాన్ని నియంత్రించటమే గాకుండా అమూల్యమైన స్పర్శజ్ఞానాన్ని కలిగిస్తుంది. వేడి, చలి, నొప్పి ఇతర వస్తువుల స్పర్శ మొదలైనవి చర్మంవల్లే తెలుస్తాయి. చర్మంలో ఉండే వివిధ నరాగ్రాలు ఇటువంటి ప్రత్యేక జ్ఞాన సందేశాలను మెదడుకు పంపుతాయి. చేతివేళ్ళలోను, కాలి వేళ్ళలోను నరాగ్రాలు అధిక ప్రమాణంలో ఉంటాయి. కాబట్టే వీటికి స్పర్శజ్ఞానం అతి సూక్ష్మంగా ఉంటుంది.

అసలు స్పర్శజ్ఞానం లేకపోతే మనం జీవించడమే వ్యర్థమనిపిస్తుంది. రాత్రి పగలు మనకు తెలియకుండా నిరంతరం పై చర్మం సూక్ష్మమైన పొరను విడుస్తూ ఉంటుంది. తిరిగి యథాస్థితికి వస్తూ ఉంటుంది. చర్మానికి ముఖ్యంగా పునఃచేతనక్రియ కలిగి ఉండటమే దాని విశిష్ట సామర్థ్యత. కెరాటిన్ (keratin) అనే ప్రోటీను పదార్థాన్ని తయారు చేసుకుంటూ చర్మాన్ని మృదువుగా, గట్టిగా, సులభంగా వంగేటట్టుగా ద్రవ పదార్థాలు కారిపోకుండా ఉంచుతుంది.

సామాన్యంగా దేహం విసర్జించే నీటిలో 90 శాతం మూత్రరూపంగా మూత్రావ

---

## శాఖాహారంతో జీవించిన 107 సం.ల వృద్ధురాలు

రష్యాలో లెనిన్‌గ్రాడ్‌కు చెందిన అఫనేసియా అబ్రమోవ్నా (Afanasia Abramonna) అనే 107 సం.ల వృద్ధురాలు జీవితాంతం పళ్ళు, కూరగాయలు, పాలు, బంగాళాదుంపలతో తయారైన పానీయంతోనే జీవించింది. ఆమె తన 98.వ ఏట తొలిసారి దంతవైద్యుడి దగ్గరకు వెళ్ళింది

"మనోనైర్మల్యం, ప్రాశ్యాముఖవం, కాంతి, విశ్వతృప్తి, జీవన్ముక్తుని లక్షణాలు."

యాలగుండా బయటకు విసర్జింపబడు తుంది. వాతావరణంలో ఉష్ణాధిక్యంవల్ల చర్మం చమట రూపంలో 10 శాతం నీటిని విసర్జిస్తూ ఉంటుంది. చర్మం అడుగుపొరలో ఎపోక్రైన్, ఎక్రైన్ అనే స్వేదగ్రంథు లుంటాయి. ఈ పొరలోనే తైలగ్రంథులు కూడా ఉంటాయి. ఇవి స్రవించే ఒక రకం జిడ్డువల్ల చర్మానికి నిగారింపు కలుగు తుంది. చర్మం నీటలో నానిపోదు. వెంట్రు కలకు నిగారింపుకూడా దీనివల్లే కలుగు తుంది. అరచేతులు, అరికాళ్ళలో ఈ గ్రంథులు ఉండవు నగటు మనిషి చర్మంలో 20 లక్షల స్వేద గ్రంధులు అమోఘంగా పనిచేస్తూ దేహంలో ఉష్ణో గ్రతను నియంత్రిస్తాయి. సెబేసియస్ గ్రంథులు (sebaceous glands) చర్మానికి మృదుత్వాన్ని, నిగారింపును కలిగిస్తాయి. విటమిను 'డి'ని సంయోగపరచుకోడానికి వీటినుండి ఉద్భవించే సేబం (sebum) చర్మానికి సహకరిస్తుంది.

దేహ ఆరోగ్యానికి చర్మం యధార్థమైన దర్పణం వంటిది 'ఆరోగ్యవంతమైన శరీరానికి ఆరోగ్యవంతమైన చర్మం' అనేది శాస్త్ర సమ్మతము, వాస్తవము ఇప్పటికీ మన స్సునుబట్టి చర్మం; చర్మాన్నిబట్టి దేహం; బాగా కోపోద్రేకం కలిగినప్పుడు ముఖం ఉబ్బుతుంది భయం వేసినప్పుడు ముఖం పాలిపోయి వెలవెలపోతుంది. నరాల బల హీనతవల్ల చలివేస్తుంది. చమటలు పట తాయి. భయంవల్ల గగుర్పాటు కలుగుతుంది. కాబట్టి మనస్సుకు దర్పణం వంటిది చర్మం. దేహంలో యితర అంగాలకు - చర్మానికి దగ్గర సంబంధముంది. అందుచేతే దేహంలో ఉద్భవించే అనేక రోగలక్షణాలు చర్మంమీత కనిపిస్తాయి. ముఖ చర్మం మనోభావాలను మార్చుకోడానికి వీలుగా చర్మం ఇవ్వకు లోబడి ఉంటుంది.

దేహంలో ఉండే అనేక రోగాలు చర్మం మీద కనిపిస్తాయి గుండె జబ్బులు, రక్త సంబంధమైన రోగాలు, మధుమేహంవల్ల ఎక్కువగా చమట, కామెర్లరోగంవల్ల చర్మం పచ్చన మొదలైనవి. ఒక్కొక్క

## బటర్‌ఫ్లై తోటలు



జూలాజికల్ సర్వే ఆఫ్ ఇండియావారు సీతాకోకచిలుక (బటర్‌ఫ్లై)ల తోటలు (farms) మూడింటిని ఏర్పాటు చేయబోతు న్నారు. ఇక్కడ రక రకాల సీతాకోక చిలు కలు వాటి పుట్టుకల విధానాలను పరిశోధించ డానికి అవకాశం కలుగుతుంది.

"కామము, క్రోధము, లోభము, దంభము,
అసూయ, అహంకారం రజోగుణాలు."

ప్పుడు చర్మం మీద ఎర్రటి పొడలు, దద్దురులు, మచ్చలు ఏర్పడతాయి.

దేశాన్ని ఆధునీకరణం చేయడం వల్ల, పారిశ్రామికవంతం చేయడంవల్ల దేశం ఆర్థికంగా సౌభాగ్యాన్ని పొందగలుగుతుంది. కాని దేహసౌభాగ్యం నశించిపోతుంది.

చర్మ రక్షణ, సౌందర్య పోషణ ఈ నాటిది కాదు. అనాది నుంచీ వస్తున్నదే. ప్రాచీన రోమనులు, ఈజిప్షియనులు, ఇతర అనేక నాగరిక దేశస్థులు చర్మరక్షణను ఒక ప్రత్యేక కళగా అభివృద్ధి చేసుకున్నారు. భారతదేశం కూడా ఎంత మాత్రం తీసిపోలేదు. మన దేశంలో అనేక ఆయుర్వేద గ్రంథాలు— ముఖ్యంగా 'చారుచర్య' అనే గ్రంథం చర్మ సంరక్షణ, సౌందర్యపోషణను గురించి చెబుతుంది. చర్మానికి తైలాలు పట్టించడం, సువాసన ద్రవ్యాలు (కచ్చూరాలు. బావంచాలు, వట్టివేళ్ళు. కస్తూరి పసుపు, తాళిసపత్రి వగైరా) సీకాయిలో కలిపి గాని, సున్నిపిండిలో కలిపి గాని రుద్దుకోడం మన ప్రాచీన ఆచారం. నేడు చర్మ సంరక్షణ సౌందర్యపోషణ తెలియని స్త్రీ లేదు. ప్రపంచంలో చర్మరక్షణ చైతన్యం నేటి నాగరిక లక్షణం. సౌందర్యం బాహ్యచర్మానికి సంబంధించినదే కాదు, సంపూర్ణ దేహారోగ్యం వల్లే చర్మం సౌందర్యాన్ని ప్రతిబింబిస్తుంది. చర్మాన్ని రక్షించుకుని సౌందర్యాన్ని పోషించుకోవాలంటే:—

**పారిశుద్ధత:** సక్రమంగా మూడు పూటలు, రెండు పూటలు కాకపోయినా అర్ధంరోజుకు ఒక పూటైనా మరివెచ్చని నీటిలో స్నానం చేయాలి ఘాటైన సబ్బులు కాకుండా సౌమ్యమైన సబ్బులు వాడాలి. సబ్బుకంటే పిండి, సీకాయి మంచివి. అసలు చర్మం నిరంతరం పాత చర్మాన్ని విడిచి క్రొత్త చర్మంతో శుభ్రంగానే ఉంటుంది. సబ్బును అధికంగా వాడటం వల్ల చర్మంలో సహజమైన జిడ్డు పోతుంది. చర్మానికి నిగారింపు పోతుంది. ముడతలు ఏర్పడతాయి.

**సౌందర్య పోషకాలు:** ప్రసిద్ధి పొందిన సౌందర్య పోషకాలు స్నోలు, పౌడర్లు, లిప్‌స్టిక్‌లు, మేకప్పులు అమితంగా వాడకూడదు. చర్మానికి అపాయం కలిగిస్తాయి. అవసరాన్నిబట్టి మితంగా వాడటం మంచిది. లేకపోతే చర్మం ఛాయే మారి

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద విమానం



405 టన్నుల భారంతో రష్యా దేశపు 4 ఇంజనుల జెట్ అంటోనోవ్-124 ప్రపంచంలోనే మిక్కిలి పెద్ద వాయు విమానం. ఇది గంటకు 840 కి.మీ. అధిక వేగంతో 16,500 కి.మీ. దూరం పోగలదు.

"నీలో నీకు శాంతి లేనప్పుడు మరోచోట శాంతిని పొందడం అసంభవం."

పోతుంది. చర్మరోగాలు పట్టుకుంటాయి. అలర్జీ. దద్దురులు ఏర్పడతాయి.

**పౌష్టికాహారం:** ఆరోగ్యవంతమైన దేహానికి అందంగా నవనవలాడే చర్మం ఉంటుంది. సమతూక పౌష్టికాహారం సక్రమంగా సేవిస్తే దేహారోగ్యమే కాదు చర్మారోగ్యం కూడా కలుగుతుంది. పుష్కలంగా పాలు, తాజాకూరలు, పళ్ళు తినాలి.

**ధరించే బట్టలు:** అవసరాన్ని బట్టి బట్టలు ధరించాలి, గొప్పకోసం కాదు. నున్నితమైన నూలుబట్టలు. ఖాదీ బట్టలు వదులుగా ధరించడం వేసవి కాలానికి అనువుగా ఉంటుంది. పట్టుబట్టలు టెర్రీకాట్‌లు చలికాలానికి ఉపయోగపడతాయి. కొందరికి సింథటిక్ బట్టలు వేసుకుంటే ఎలర్జీ వస్తుంది. చర్మం మీద దద్దుర్లు లేస్తాయి.

**వ్యాయామం:** స్నానం చేసేటప్పుడు, స్నానానికి ముందు చర్మాన్ని మెల్లిగా చేతులతో రుద్దుకుంటే చర్మంలో నెత్తురు బాగా ప్రవహిస్తుంది. యోగాసనాలు ముఖ్యంగా ప్రాణాయామం చర్మాన్ని ఆరోగ్యకరంగా ఉంచుతుంది.

సరైన వైద్యుల సలహాలను తీసుకోకుండా అనవసరంగా ఔషధాలను వాడకూడదు. గాయాలకు, దెబ్బలకు, కోతలకు పెన్సిలిన్ మరియు యితర మందులు వాడటం మంచిది కాదు. ఇవి మంచికి బదులు చెడును కలిగిస్తాయి. ఉపయోగించే సబ్బులు, సౌందర్యపోషక వస్తువులు మాటి మాటికీ మార్చకూడదు. అనారోగ్యకరమైన దుస్తులు, మురికైన వస్తువులు, దుమ్ము, ధూళి చర్మానికి హానిని కలిగిస్తాయి. అన్నిటి కంటే ఆరోగ్యవంతమైన శరీరానికి, చర్మానికి మానసిక ఆరోగ్యం ఎంతైనా అవసరం. జీవితంలో వీలైనంతవరకు అనవసరపు వాంఛలను తగ్గించుకుని దురలవాట్లకు లోనవకుండా అన్ని విషయాలలోను మితత్వాన్ని అనుసరిస్తూ స్వధర్మంతో పాటు దైవచింతనతో కుటుంబధర్మం నిర్వర్తించుకుంటే చర్మాన్ని గురించి చింతపడక్కరలేదు.

## భూమిని గురించి అదనంగా తెలుసుకోడానికి వజ్రాల సహాయం!



భూగర్భ శాస్త్రజ్ఞులు భూమి పరిణామాన్ని గురించి అదనంగా తెలుసుకోడానికి భూమట్టానికి ఎక్కడో 20 కి.మీ. లోతులో ఉంటూ ఇతర ఖనిజాలతో చేరి లక్షలాది సంవత్సరాల తరువాత పైకి వచ్చిన వజ్రాలను ఉపయోగిస్తారు.

"దీపము కొంచెమైనను గొప్పదగు చీకటిని నశింపచేయునట్లు జ్ఞానాభ్యాసము కొంచెమైనను అజ్ఞాన సమూహాన్ని పోగొట్టును."

# చైనీయుల అభినందన విధానం

ఇతర దేశస్థుల అలవాట్లు ఆచారాలు మనకు ఎంత వింతగా కనిపిస్తాయో అలాగే మన ఆచారాలు, మన వ్యవహారాలు వాళ్ళకూ అంత వింతగా కనిపిస్తాయి.

చైనా దేశస్థులు ఇద్దరు తెలిసిన వాళ్ళు కలుసుకున్నప్పుడు 'భోజనమైందా?' లేకపోతే 'మీ జీర్ణశక్తి ఎలా ఉంది?' అని అడుగుతూ తమ చేతులను తామే షేక్ (shake) చేసుకుంటారు. పై ప్రశ్నలకు ఎదుటివాళ్ళు 'ఓ బాగుంది. మీ ప్రేమాతిశయాలకు నా అభినందనలు' అంటూ ఇలాంటి మాటలతో పరస్పరం మాట్లాడుకోడం చైనావారి మర్యాద.

మధ్య అమెరికా, కోస్టారికాలో కరచాలనానికి బదులు భుజాలమీద తట్టుకుంటారు. ఇద్దరు అరబ్బులు కలుసుకున్నప్పుడు 'మీకీ రోజు తెల్లగా ఉండుగాక' అని ఒకరు అంటే మరొకరు 'మీ రోజు పాలలా ఉండుగాక' అంటాడు. ఉత్తర ఆఫ్రికాలో అరబ్బు, బెర్బెర్ సంతతికి చెందిన దేశదిమ్మరులలో కల ఆచారం చాలా విపరీతంగానూ, వింతగానూ కనిపిస్తుంది. క్రొత్తగా కనిపించిన వ్యక్తి దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళి తలపైన ఒక తుపాకీని పేలుస్తారు.

థాయిలాండ్‌లో (ఆగ్నేయ ఆసియా) పరస్పరం చేతులు పట్టుకుని మెటికలు విరిగేదాకా వేళ్ళు లాక్కుంటారు.

ఆఫ్రికా మధ్యభాగంలో ఎడమకాలు ఎత్తి కుడికాలిమీదుగా ముఖంమీదికి తెచ్చుకుంటారు.

పసిఫిక్ మహాసముద్రానికి నై... దిక్కుగా ఉన్న పాపువా న్యూగినియాలో నివసించే జనం పరస్పరం విడిచి వెళ్ళేటప్పుడు ముఖానికి మట్టి పులుముకుని అతి దీనంగా ఏడుస్తారు. బయలుదేరిన వాడు కంటికి కనిపించేదాకా ఇలా విలపిస్తారు. తరువాత ముఖం కడుగుకొని వెంటనే మిగిలిన వాళ్ళతో కులాసాగా నవ్వుతుంటారు. ●

## మానవ ధర్మం శ్రమ



ఈ భూమి మీద మానవధర్మం శ్రమ. దినం నిత్యం ముందుకు సాగుతూంటుంది సౌరకుటుంబానికి చెందిన ఈ భూగ్రహం మీద పనిలేనివారు దీన్ని వదలి ఎక్కడైనా సోమరి గ్రహాన్ని వెతుక్కొని వలస పోవలసిన రోజులు వస్తాయి. యోగ్యులైన శ్రామికులందరూ ఈ ప్రకృతి సిద్ధాంతాన్ని ఆమోదించి ఆనందించాలి.

—జార్జి బెర్నార్డ్ షా

"మద్యపానము చేయ మదివెత్త మేటికి?"

# స్వర్గం ఎక్కడ?

వేదాంత మార్గ పరమావధి మోక్షం
మోక్షం మరో ప్రపంచం కాదు
మోక్షం మరో తావున లేదు
మోక్షం పూలవనంలో లేదు
మోక్షం గాన విహారంలో లేదు.
వ్యక్తిగతమైన ఆత్మ తత్త్వజ్ఞులకు
ముక్తి ఎంతో సులభ సాధ్యం.



మోక్షం ప్రత్యేక ప్రదేశంలో లేదు.
రాజుల మేడలలో లేదు
శృంగార వనంలో లేదు
మరో ఆనంద ప్రపంచం కాదు
ఇంద్రియ నిగ్రహంతో
ఏకాగ్రతతో
అనంత రూపుని ధ్యానానందంలో
సుఖదుఃఖాలు పటాపంచలైతే
అప్పుడే అక్కడే అదే స్వర్గం.
స్వర్గానందంలో బంధా లుండవు.
జ్ఞానోదయం అవుతుంది.
చీకూ చింతా ఉండని
చిత్త స్థైర్యం స్వర్గం.
మూఢత్వంతో మార్గం తప్పిన యాత్రికులు
మోక్ష మెక్కడ? చేరేదెట్లా అంటూ
చిత్తభ్రమతో సతమత మవుతారు.

-నమ్మాళ్వారు.

## చదవడం తెలియని సుప్రసిద్ధ గాయకుడు

ఫ్రాన్స్ దేశపు సుప్రసిద్ధ గాయకుడు పెర్రె-జీన్ గారాట్ (Perre-Jean Garat) సంగీతం గురించి ఎన్నడూ చదవకపోయినా ఒపెరా (opera) సొప్రానో (soprano), ఆల్టో (alto), టెనార్ (tenor), బారీటోన్ (baritone), బాస్ (bass) మొదలైన వాటిని అతి అద్భుతంగా పాడగలడు. ఎంత శ్రావ్యంగా పాడగలడో అంత గర్విష్ఠి. ఒక వ్యాపారస్థుడు గారట్ వాడుకునేరకం బట్టలన్నీ నాశనం చేస్తానని చెప్పేదాకా అతడు కొత్తబట్టలు కొనడానికి అంగీకరించలేదు. తను ధరించే రకం దుస్తులు ఇంకెవ్వరూ ధరించకూడదని గారాట్ వాదం.

"మనము ఆలోచించవలసినది కర్మను గురించియేగాని, కర్మఫలమును గురించి కాదు."

# కీర్తిని ఎందుకు ఆశిస్తారు?

జె. కృష్ణమూర్తి

ప్రారు గొప్ప పేరు, కీర్తిప్రతిష్ఠలు పొందా అది ఎందుకు అనుకుంటారు? దీనిని వివరించి చెబుతాము. విన్న తరువాత మీరు ఉద్యమాన్ని మానుకుంటారా? సంఘంలో,



సమాజంలో నీ చుట్టూ అందరూ కీర్తిమంతులు అవాలనే అనుకుంటారు కాబట్టి నువ్వూ కీర్తిని పొందాలని అనుకుంటావు. మీ తల్లిదండ్రులు, మీ స్నేహితులు, మీ గురువులు, యోగి అందరూ గొప్ప వాళ్ళ మవుదామని అనుకుంటారు. అందుకే నువ్వుకూడా గొప్పవాడవు కావాలని అనుకుంటావు.

అసలు మానవులు తాము కీర్తివంతులు అవాలని ఎందుకు అనుకుంటారు? మొట్టమొదట గొప్పవాళ్ళు అవడంవల్ల ఎంతో లాభకరం. అది మీకు ఎంతో సౌఖ్యాన్ని, ఆనందాన్ని చేకూరుస్తుంది. ప్రపంచంలో మీరు అందరికీ తెలిసి ఉంటే మీకు ఒక ప్రాంతాతనం ఏర్పడుతుంది. అది మీకు ఒక అమృతత్త్వాన్ని ఆపాదిస్తుంది. మీరు కీర్తిని పొందాలనుకుంటారు. ప్రపంచంలో పలుకుబడి కలగాలని అనుకుంటారు. పలుగురూ మిమ్మల్ని గురించే మాట్లాడుకోవాలనుకుంటారు. వాస్తవంగా ఆలోచిస్తే నీలో నీవు ఏమీ కాదు. శూన్యం. అంతర్యంగా పరిశీలించుకుంటే ఏ ఐశ్వర్యం ఉండదు. కాబట్టి బాహ్య ప్రపంచంలోనే నువ్వు గొప్పవాడవు కావాలని అనుకుంటావు. కాని ఆంతరంగికంగా ఐశ్వర్యాన్ని అనుభవించగలిగితే పలుకుబడి ఉన్నా లేకపోయినా అసలు నీవు చింతించవు.

బాహ్యంగా కంటే ఆంతరంగిక ఐశ్వర్యాన్ని, గౌరవాన్ని పొందడం చాలా కష్టం.

## గురక వల్ల గుండె జబ్బులు

ఇద్దరు ఆస్ట్రేలియా వైద్యుల పరిశోధన ప్రకారం బాగా గురకతో నిద్రకు అలవాటు పడ్డవారికి ఇతరుల కంటే సులభంగా గుండె జబ్బులు, రక్తపుపోటు వస్తుందని తేలింది. నిద్రలో గురకవల్ల పగటిపూట నిద్రమత్తు కూడా ఏర్పడుతుంది.

...క్కొని జాగ్రత్త వహించాలి. మీకు వివేకం, విజ్ఞానం ఉంటే వాటిని సద్వినియోగించు కోవాలో తెలుసుకుంటే మీరెంతో గొప్పవారై పోతారు: కీర్తిమంతులు అవుతారు. కాని అంతరంగిక ఐశ్వర్యాన్ని ఇంత సౌలభ్యంగా పొందలేరు.

అంతరంగికంగా ఐశ్వర్యవంతులు కావా లంటే గొప్పవాళ్ళు కావాలి అనుకోడం వంటి ముఖ్యం కాని కొన్ని సామాన్య విషయా లను బాగా తెలుసుకుని మనస్సులో నుంచి వాటిని పూర్తిగా తొలగొట్టుకోవాలి. అంత రంగిక ఐశ్వర్యం అంటే మీ అంతట మీరు ఇతర అపేక్షలు లేకుండా నిబ్బరంగా నిలబడ గలగాలి. కాని కీర్తిమంతులు కావాలనుకునే వారు ఇతరుల సదభిప్రాయాల మీద, పొగ డ్తల మీద ఆధారపడి ఉంటారు. కాబట్టి ఒంటరిగా నిలబడడానికి భయపడతారు. ఆశ అనేది లేకుండా ఈ ప్రపంచంలో జీవించడం సాధ్యమా?

అత్యాశ మానవాళికి ఎంతో చేటును కలి గిస్తుంది. దుఃఖాన్ని చేకూరుస్తుంది. వినా శాత్మకమైన ఆశలేని స్వార్థరహితమైన పరి పూర్ణ అంతరంగిక ఐశ్వర్యంతో జీవితాన్ని ఆనందదాయకంగా, సృజనాత్మకంగా మలచు కోవచ్చు. వ్యక్తిగతంగా జీవించే అటువంటి విధానాన్ని మీరు తెలుసుకోవాలి. మీ జీవితం ఇతరుల జీవితానికి అపాయం కలిగించ రాదు; అటకం కలిగించకూడదు. ఇదంతా ఊహాత్మక ప్రపంచంలో స్వప్నంలా కన్పించ ఊహాత్మక ప్రపంచాన్ని గురించి మీకు వివరించడం లేదు. [illegible] తెలిసిన మనవంటి వాళ్ళ, నావంటివారికి ఈ ప్రపంచంలో ఆశలేకుండా సృజనాత్మకంగా జీవించడం సాధ్యమా? ఇతరులు చూసి మెచ్చు కోవాలని కాకుండా మనం చేయవలసిన కార్యం, ధర్మం విధాయకంగా నెరవేర్చి నప్పుడు ఇంకొకరితో పోటీ ఏర్పడడానికి అవకాశ ముండదు. ఇదే అసలు కిటుకు. మీరు చేసేవాటిని ఆదరాభిమానాలతో నిర్వ రించాలి. ●

## ముఖచిత్రవ్యాఖ్య

"మురిసిపోతావు ఎంతగానో
'మోడల్' పని మరచి పోకు
ఏ మాత్రం"

—జి. ఆర్. కె. రెడ్డి, చినకొదమగుండ్ల,
(గుంటూరు జిల్లా)

• • •

"అందం ఒక వరం
అది అయ్యింది నీ వరం"

—కె. కనకదుర్గ, ఆత్మకూరు,
(కర్నూలు జిల్లా)

• • •

"నీ మోముపైని ఆ చిరునవ్వు కన్న
'విస్డమ్' ప్రసాదించే జ్ఞానమేమున్న."

—ఎ. శ్రీపాద్, హైదరాబాద్.

## బి. ఎన్. బెనరి

ఇంక పదిహేను సంవత్సరాలకి ఈ శతాబ్దం పూర్తి అయిపోతుంది. మరో నూతన శతాబ్దం ప్రారంభమవుతుంది.



ఇదే ఇరవై ఒకటవ శతాబ్దం. ఈ నూతన శతాబ్దం ఎలా ఉంటుంది? మానవులు ఇక ముందు ఈ క్రొత్త శకంలో ఏయే అద్భుతాలు చూడబోతారు? మానవుని మంచికో లేక జీవ కోటి నాశనానికో అధిగమిస్తూన్న విజ్ఞానా వధులను పరిశీలిస్తే విప్లవాత్మకమైన లు ఏర్పడగలవని బోధకమానదు.

ముఖ్యంగా వైజ్ఞానికరంగంలోను, సాంకే రంగంలోను బ్రహ్మాండమైన మార్పులు మానవు. క్రొత్త శతాబ్దం ంభానికి ముందే, వ్యవసాయ రంగం లోను, శస్త్రచికిత్స మరియు వైద్య విభాగం లోను, అణువిజ్ఞాన రంగంలోను, అంతరిక్ష వైజ్ఞానికరంగంలోను, వాతావరణ విజ్ఞానంలోను, పారిశ్రామిక విభాగంలోను మహా అద్భుతమైన ప్రగతి ఏర్పడుతుంది.

15 సంవత్సరాల తరువాత భూమాత నేటికంటే ఎన్నోరెట్లు పెరిగిపోగల జన బాహుళ్యానికి అవసరాలు తీర్చవలసిన పరిస్థితులు ఏర్పడతాయి. వ్యవసాయ శాస్త్ర నిపుణులు అధిక ఆహారోత్పత్తికి నూతన మార్గాలను సృష్టిస్తారు. ప్రస్తుత భూభాగం వ్యవసాయానికి చాలీచాలకుండా ఉంటుంది. భవిష్యత్తులో వ్యవసాయ కార్యక్రమాలు విస్తృతంగానే కాకుండా తీవ్రంగా కూడా కొనసాగిస్తారు.

### పోషకాహారలోపం వల్ల మరణించే పిల్లలు

భారత దేశంలో సుమారు 1000 లక్షల మంది పాఠశాల వయస్సురాని పిల్లలు ఉన్నారు దీంట్లో 30-40 లక్షలమంది సక్రమ పోషకాహార లోపంవల్ల కలిగే రోగాలతో బాధపడుతున్నారు. దీనివల్ల సాలీనా 10 లక్షల మంది మరణిస్తున్నారు. భారత దేశంలో మూటికి రెండువంతుల పిల్లలకు సక్రమపోషకాహారం లభించటంలేదు.

"అనురాగము, జీవకారుణ్యము భగవంతునికి అవసరాన్ని కూర్చే ధర్మం."

రించి నిరోధించడానికి అద్భుతమైన మందులు కనుగొనబడతాయి. ఇటువంటి రోగులకు



అణువైద్య విధానాలు కూడా ఏర్పాటుచేస్తారు. వైద్యవిధానంలో వృద్ధాప్యం, వృద్ధాప్యానికి సంబంధించిన శాస్త్రం ప్రత్యేకంగా ఏర్పడుతుంది పెద్ద హాస్పిటళ్ళలో వృద్ధులకు ప్రత్యేకంగా వృద్ధ విభాగాలు ఏర్పాటు చేస్తారు. ఇక్కడ వృద్ధులకు తగిన సంరక్షణ, చికిత్స లభ్యమవుతుంది. ఇంకా బాధలను తట్టుకోలేని విపరీత పరిస్థితులలో - శస్త్రచికిత్సల ద్వారా, ఔషధాల ద్వారా చికిత్స అసంభవం అనే రోగులకు-చట్టరీత్యా మారకరూపమైన తరుణోపాయం కల్పించబడుతుంది. బయోలాజికల్ ఇంజనీరింగ్‌లో హృదయాల మార్పిడి, మూత్ర పిండాల మార్పిడి, కళ్ళు, కాళ్ళు, చేతులు, మరియు వివిధ అంగాల మార్పిడి సర్వ సామాన్యంగా జరుగుతుంది

జనాభా ఒత్తిడి విపరీతమైన ప్రదేశాలలో ఒక కుటుంబానికి అధికారి నా, అధికారి నా ఒకే బిడ్డ అనే నిబంధన సామూహిక నియమం చేసి

## బ్రహ్మ నారద సంవాదం

ఉపనిషత్తులలో సృష్టి కర్త అయిన బ్రహ్మకు, నారదుడికి జరిగిన సంవాదాన్ని చక్కగా పొందుపరచారు.

ఒకప్పుడు నారదుడు ఉపదేశం పొందడానికి బ్రహ్మను ఆశ్రయించారు. బ్రహ్మ 'రేపు రా' అని చెప్పి పంపేసాడు. మరునాడు నారదుడు గ్రంథాలన్నీ ప్రోగుచేసుకొని బ్రహ్మదగ్గరకు వెళ్ళారు. బ్రహ్మ అది చూచి, 'అవన్నీ ఎందుకు?' అన్నారు. నారదుడు "నే నెన్ని గ్రంథాలు చదివానో, నే నెంత నేర్చుకున్నానో మీకు తెలియడానికి" అన్నాడు.

పకపకా నవ్వుతూ బ్రహ్మ 'వెర్రి మొఖమా! జ్ఞానం రెండు రకాలు. చరిత్ర, భూగోళం, జ్యోతిషం, రసాయనిక శాస్త్రం వంటి సామాన్యశాస్త్రాలు మొదటివి. రెండవది నీవు చదివిన దానికి ఏ మాత్రం సంబంధం లేని అధ్యాత్మిక విజ్ఞానం. అయితే నీవు సామాన్య శాస్త్రంకోసమా, అధ్యాత్మిక జ్ఞానం కోసమా వస్తున్నావు?' అని అడిగాడు.

నారదుడు 'అధ్యాత్మిక జ్ఞానం కోసమే నిన్ను ఆశ్రయిస్తున్నాను' అన్నాడు. 'అధ్యాత్మిక జ్ఞానం గ్రంథాలు చదివి తెలుసుకోలేవు. నువ్వు దాన్ని అనుభవించాలి' అన్నాడు. వెంటనే నారదుడు 'నాకు ఎలా అనుభూతికి వస్తుంది' అని అడిగితే, బ్రహ్మ నారదుడికి ఉపదేశించి 'కూర్చో, మాట్లాడకుండా కూర్చుని నీవు తెలుసుకున్నదంతా మరచిపో' అన్నాడు.

---

"లోకాలను పరమార్థ సాధనాలుగా మలచుకో గలిగినవాడు జ్ఞాని."

దట్టబద్ధం చేసేస్తారు. అంతరిక్ష విజ్ఞానశాస్త్రం అమోఘంగా ప్రగతి చెందుతుంది. వారు ఐదు కృత్రిమ ఉపగ్రహాలు కాదు లక్షలకొద్దీ కృత్రిమ ఉపగ్రహాలు అంతరిక్షంలోకి చేర్చ



బడతాయి. ఇటువంటి దేశాలలో క్రొత్తగా పెళ్లైన వధూవరులు అంతరిక్ష నౌకల్లో బయలుదేరి అంతరిక్ష ఆశ్రయంలో హనీమూన్ కొద్ది రోజులపాటు జరుపుకుంటే ఆశ్చర్యముండదు.

అభివృద్ధి పొందిన దేశాలలో చంద్ర గర్భంలో పరిశోధక కేంద్రాలు స్థాపించి మానవులను అక్కడికి తరలిస్తారు. అంతరాళంలో ఇతర గ్రహాలలో వ్యాపించిన విభిన్న నాగరికులనుంచి వార్తలు గ్రహించగలుగుతారు.

వాతావరణ విభాగంలో ముఖ్యంగా పొగ, శబ్దం, పారిశ్రామిక కాలుష్యాలు, విషవాయువులు, దుమ్ము, భూస్తరణముల నిరోధక కార్యక్రమాలు, ఉద్యమాలు తీవ్రతరమవుతాయి. పట్టణాలలో వాతావరణాన్ని శుభ్రపరచడానికి అవసరమైన వైజ్ఞానిక విధానాలు కనిపెట్టబడి, నగరవాసులకు మరింత మంచి గాలిని పీల్చుకునే అవకాశాలు ఏర్పడతాయి.

గన్ పౌడర్ శక్తి ఇంకా పూర్తికాలేదు. ఉత్పత్తాయి అందుతుంటుంది. ఈ విధా గంలో అమెరికా చేపట్టిన 28 బిలియన్ డాలర్ల 100 Mx (Missile Experiment) ఒకటి. ఇందులో ఒక్కొక్క ఆయుధానికి 10 వార్ హెడ్‌లు ఉంటాయి. ప్రతి వార్ హెడ్ హిరోషిమాను ధ్వంసం చేసిన బాంబుకు పదిరెట్లు అధికశక్తి కలిగి ఉంటుంది. కొన్ని అగ్రరాజ్యాలు తయారు చేస్తున్న ఇంటర్ కాంటినెంటల్ బాలిస్టిక్ మిస్సైల్ (ICBM), న్యూక్లియర్ సబ్ మెరైనులు, హైడ్రోజన్ బాంబులు, న్యూట్రాన్ బాంబులు, ఇతర రసాయనిక పదార్థాలు మొదలైన మారణాయుధాలవల్ల తీవ్ర పరిణామాలు సంభవిస్తాయి. ముఖ్యంగా న్యూట్రాన్ బాంబు ప్రయోగిస్తే మానవులతో సహా దృశ్యాదృశ్య ప్రాణికోటి, వృక్షజాలం, జంతుజాలం సంపూర్ణంగా నశించిపోతుంది. ●

## అంతరిక్ష ప్రయాణీకులు పగటి పూట నక్షత్రాలను చూడగలరు

అంతరిక్షంలోకి ప్రవేశించిన వెంటనే అంతరిక్ష ప్రయాణీకులకు (౧) భూమ్యాకర్షణ శక్తి ఉండదు కాబట్టి, శరీర బరువు అనిపించదు, (౨) అంతరిక్షంలో ప్రాణవాయువు ఉండదు కాబట్టి, వారికి ప్రత్యేకంగా ఊపిరి పీల్చుకునే సాధనాలు ఉండాలి. (౩) పగటిపూట కూడా నక్షత్రాలను చూడగలుగుతారు.

"పోగొట్టుకున్న దానికై హృదయం విలపిస్తే,
పొందిన దానితో ఆనందిస్తుంది ఆత్మ."   —అబునూరె హాన్

# విజ్ఞాన వేదిక

## అంతరాళం

ఆకాశంలో ఖగోళ రాసుల మధ్యప్రదేశం అంతరాళం (space). భూమి మీద ఉండే మానవుడికి వాతావరణం దాటిన తరువాత అంతరాళం ఆరంభమయి అనంతంగా అవరించుకుని ఉంటుంది.



SOLAR SYSTEM

భూమిచుట్టూ ఉండే వాతావరణం దానిలో ఉండే ప్రాణవాయువు సాంద్రతను బట్టి వివిధ పొరలుగా విభజింపబడింది. అట్టడుగుది భూమిమీద ఉండే ట్రాపోస్ఫియరు. ప్రాణులు ఊపిరి తీసుకుని జీవించడానికి తగినంత ప్రాణవాయువుతో ఉంటుంది విశాలమైన పై పొర స్ట్రాటోస్ఫియరులో ప్రాణవాయువు ఏ కొద్దిపాటో ఉంటుంది. ఇది ప్రాణులు జీవించడానికి సహకరించదు.

నక్షత్రాలు, గ్రహాలు మరియు చంద్రమండలాలు, అస్టిరాయిడులు, ఉల్కలు, తోక మొదలైన వాటితో అంతరాళం నిండిపోయింది. ఒక్క నక్షత్రాలే లక్షలు, లక్షలుంటాయి. కొన్ని ఖగోళ రాసులలో జీవరాసులు, జంతువులు, చెట్టుచేమలు మనకు తెలియనివి ఉండవచ్చు. కొన్నిటిలో ఇవి ఉండకపోవచ్చు కూడా. భూమండలం ఒకటే జీవరాసులు, వృక్షాలు పెరగడానికి అనుకూలంగా ఉండవచ్చు.

అంతరాళంలో కొన్ని ప్రదేశాలలో అతిశీతలంగా ఉంటుంది. మరికొన్ని ప్రదేశాలు విపరీతంగా నక్షత్రాలను మించిన ఉష్ణోగ్రతతో మండిపోతూ ఉంటాయి. కొన్ని నక్షత్రాల మధ్య ప్రదేశాలలో ఉష్ణోగ్రత 500 లక్షల ఫారిన్‌హీటు డిగ్రీలను మించి ఉంటుంది.

---

## 45 లక్షల డాలర్లు పలికిన బ్లూ జాగీరు

జెనీవా [స్విట్జర్లాండ్]లో 42.92 కారట్లు తూగే ఒక బ్లూ జాగీరు (blue diamond) నవంబరు 17-1984 జరిగిన వేలంలో 45 లక్షల డాలర్లకు అమ్ముడు పోయింది. ఇంత వరకు బ్లూ జాగీర్ వేలంలో రికార్డైన అత్యధిక విలువ ఇదే.

---

"ఈ అనంత జీవిత సాగరం తరించడానికి నాకు నీవు నావ, నీవు లేనిదే ఎట్లా తరించగలను?" —మీరా

(8 వ పేజీ తరువాయి)

నిష్పత్తి నల్లవారు, హిస్పానిక్‌లు మరియు అమెరికన్ ఇండియన్స్ వంటి మైనారిటీ జాతులలో ఇంకా ఎక్కువ.

• • •

**50 రోజుల మగ శిశువు గర్భంలో ఐదు జీవాలు:**

పెషావరు (పాకిస్థాన్) లో కైబర్ టీచింగ్ హాస్పిటలులో 50 రోజుల మగశిశువుకు శస్త్ర చికిత్స చేసి బల్లులు అంత ప్రమాణంగల ఐదుగురు పసిపిల్లలను గర్భంలోంచి తీసారు. ఇది చాలా అపూర్వమని శస్త్రవైద్యులు అంటున్నారు.

• • •

**విద్యుచ్ఛక్తి సరఫరాకు క్రొత్త విధానం:**

భారతదేశంలో మొట్టమొదటిగా 220 KV అదనపు వోల్టేజి ప్రసారానికి సీరీస్ కాంపన్సేషన్ విధానం కేరళ కోజికోడ్‌లో ప్రారంభించారు. ఈ క్రొత్త విధానం వలన 220 KV ప్రసారంచేసే తీగలు ఇప్పుడుంటూన్న 170 MW మీద 380 MW అదనపు విద్యుత్తును ప్రసారం చేయగలుగుతుంది. ముఖ్యంగా ఈ విధానం అమెరికా, రష్యా, స్వీడన్ మరియు కెనడా వంటి దేశాలలో విరివిగా వాడబడుతూంది.

• • •

**ఎద్దుబండి నిటారుగా ఉండే కొండ మెట్లు ఎక్కింది:**

తమిళనాడు చెన్నిమలై కొండలమీద వేంచేసిన శ్రీ సుబ్రహ్మణ్యస్వామి (శివుని పుత్రుడు) గుడికి ఎద్దుబండి మెట్లు ఎక్కి వెళ్ళింది. ఒక్కొక్కటి 15 అడుగుల పొడవు ½ అడుగు వెడల్పు (మోకాలు అడుగు ఎత్తు) గల 1,320 మెట్లు రెండు ఎద్దుబండి ఎక్కగలదా అని చాలామంది ఆశ్చర్యపడ్డారు. ●

## మంచిమీద మంచి చేస్తే ఘనత పెరుగుతుంది



బొట్టు బొట్టూ మహాసముద్రాలైనాయి.
ఇటుకపై ఇటుక పెద్ద గోడైంది.
అడుగు మీద అడుగు ప్రయాణమైంది.
చెట్టు ప్రక్కన చెట్లు అడవులైనాయి.
ఇసుకతిప్పపై ఇసుకతిప్పలు ఎడారులైనాయి.
పొరపాటుపై పొరపాటు పెద్ద పొరపాటైంది.
రాజీలు పైన రాజీలు నిర్ణయాలైనాయి.
మంచి మీద మంచి చేస్తే ఘనత పెరుగుతుంది.

—డి. జి. సాంబెల్

(హర్యానా శివ్యా

"ఉదక మల్పంబైన మానిలోవద్ద చేప చెరువు విడిచిన చెప్ప ఎక్కు పెట్టు.

# ప్రపంచ ప్రసిద్ధమైన ఉప్పునీటి సరస్సు

ఎన్. ఎస్. రంగమణి

మహారాష్ట్రలో బుల్‌డాన్‌హా జిల్లాలో లోనార్ దగ్గర వింతగా ఉండే భూ భౌతిక పరిణామాన్ని చూడవచ్చు. ఇక్కడి పెద్దపల్లం ఉప్పునీటి సరస్సుగా ప్రపంచ ప్రసిద్ధిని పొందింది.



ఈ పల్లం 75,000 సంవత్సరాలకు పూర్వం చంద్ర సంబంధమైన ఉల్కావల్ల ఏర్పడి ఉండాలని అంటారు. దీని లోతు సుమారు 500 అడుగులు, వైశాల్యం దగ్గర దగ్గరగా 6 కిలోమీటర్లు. 1975 లో జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియావారు ఇక్కడ తగిలించిన పలకమీద 'ప్రపంచంలో నల్లరాతి మీద బ్రహ్మాండమైన వేగంతో సహజమైన విసురువల్ల ఏర్పడిన పల్లం' అని వ్రాయబడి ఉంది. ఇచ్చటి రాతిముక్కలు చంద్ర మండలం నుంచి తీసుకువచ్చిన రాతిముక్కలలాగే కనిపిస్తున్నాయి అని మహారాష్ట్ర భాషలో వ్రాసి ఉంది. దీనివల్ల చంద్ర సంబంధమైన ఉల్కా పడటంవల్ల ఈ పల్లం ఏర్పడిందనే సిద్ధాంతాన్ని ధృవపరుస్తున్నా అగ్నిపర్వతం మండటం వల్ల ఏర్పడి ఉండవచ్చునే సిద్ధాంతం కూడా ఉంది.

సాధారణంగా నీటిలో నివసించే చేపలు, పాములు వగైరా జంతువులు ఈ నీటిలో బ్రతకవు అంటారు. ఇందులో 52 ధాతువులు (minerals) ఉన్నాయి. ఈ నీరు విషకరం కాదు. కొన్ని చర్మరోగాలకు ఈ నీరు దివ్య ఔషధంగా పనిచేస్తుంది.

కొద్దికాలం క్రితం దీని లోతు తెలుసుకోవాలని ప్రయత్నించారు. దీంట్లో రెండు పెద్ద మాతులుండటం వల్ల ఈ ప్రయత్నాలు విఫలమైయాయి. పరిశోధనకు కెనడా శాస్త్రజ్ఞులు దీన్ని సందర్శించి ఇచ్చటి రాతిముక్కలను తీసుకువెళ్ళారు. ●

## విచారణలో ఉన్న కేసులు

హైకోర్టులలో విచారణ (pending)లో ఉన్న కేసులలో ఉత్తర ప్రదేశ్ అలహాబాద్ హైకోర్టులో అత్యధికం 2.12 లక్షలు. తరువాత వరుసగా కలకత్తాలో 1.26, మద్రాసులో 1.25, కర్ణాటకలో 1.13, బొంబాయిలో 1.02 లక్షల కేసులు పెండింగ్‌లో ఉన్నాయి.

"సంపద చేతగాని కొవసాగవు మవ్వె గృహస్థ ధర్మముల్."

# పోటీలు

(డిసెంబరు 1985)

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీ మీదా అడ్రసు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 10 లు. రూ. 7 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: డిసెంబరు 20, 1985. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'మమత విలువ' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. హిరోహిటో ఎవరు? 2. ఎమ్.ఏ. చిదంబరం స్టేడియం ఎక్కడ ఉంది? 3. ఈ క్రింది గ్రంథములు రచించిన వారెవరు? (ఎ) మనుచరిత్రము, (బి) పారిజాతాపహరణము, (సి) విజయ విలాసము, (డి) పాండురంగ మహాత్మ్యము, 4. అల్యూమినియంను విస్తారంగా ఉత్పాదించే దేశం ఏది? 5. పిట్‌మన్స్ షార్టుహాండ్ విధానాన్ని కనుగొన్నది ఎవరు? 6. మహమ్మద్ ఆలీ ఈ క్రిందివాటిలో దేనికి సంబంధించిన వాడు (ఎ) బాక్సింగ్ (బి) వెయిట్ లిఫ్టింగ్, (సి) లాంగ్‌జంప్; 7.

## 'జ్యూబిలీ' ప్రపంచంలో మూడవ పెద్ద వజ్రం

ప్రపంచంలో మూడవ పెద్ద వజ్రం అని చెప్పుకోదగిన భారతదేశపు 'జ్యూబిలీ' ఇప్పుడు ఫ్రాన్స్ ముఖ్యనగరమైన పారిస్‌లో ఉంది.

"తన్ను లోకము కొనియాడగ విని యుబ్బడు సజ్జనుండు."

మనకు రాజ్యాంగ విధానము ఇచ్చినది ఎవరు? (ఎ) ఆంగ్లేయులు, (బి) భారతీయ మహిళలు, (సి) భారతీయ పౌరులు; 8. సముద్రపు నీరు ఉప్పుగా ఎందుకు ఉంటుంది?

## పజిల్

ఆధారాలు-అడ్డం: 1. ఏమైనా పురుషుని కన్న స్త్రీకే ఈ రెండు గుణాలు అధికంగా ఉంటాయేమో అనిపిస్తుంది? 6. పుష్పము అని అర్థమిచ్చే నాలుగు అక్షరాల మాటలో మొదటి అక్షరాన్ని తీసివేసినా అదే అర్థము నిచ్చేమాట, 7. రోమాంచము అనే మాటకు తెలుగుపదం — బహువచన ప్రయోగమైనా ఏకవచనముగా ప్రయోగింపబడినది, 8. అంతర్జాతీయముగా విజృంభించిన మశ్కంపులు, 9. ఆకలితో ఉన్నప్పుడు మానవులకు కడుపులో కలుగు బాధకు అనుకరణం, 10. భయము లేదని సూచించుటకు అఱచేతి ప్రేళ్ళను నిలువుగ బెట్టి ముందరికి చాచిన చేయి, తరచుగా దేవతా విగ్రహములయందు గానబడును, 11. హత్యా నేరమును విచారించి నిరూపించినప్పుడు నేరస్థునకు న్యాయాధికారి విధించే శిక్ష, 12. ఎఱ్ఱటి ఎరుపుగాక కొంచెం ఎరుపు వర్ణాన్ని తెలియజేసే వర్ణము 14. కపట వ్యాపారస్థులు సాధారణంగా వ్యాపారంలో వంచన చేసి లాభాలు పెంపొందింపుకుంటారు, 15. పర్వతములు అనే అర్థము నిచ్చే మాటతో కూడా సంస్కరింపబడని, అభరణములు, అనే రెండు మాటలు చేరి ఉన్నాయి.

నిలువు: 1. సాధారణంగా యజమానులకు ఉద్యోగస్థులలో అడ్డు 1 టిలో సూచించిన గుణపు ఎన్నికవల్ల వారి సామర్థ్యం తెలిసి వస్తుంది, 2. జ్ఞానేంద్రియాలు సంతృప్తిని పొందడం వల్ల కలిగే మానసికానుభూతి, 3. మలబారు, కేరళలో నివసించే ఒక బ్రాహ్మణజాతి, 4. పంటపొలాలలో సకాలంలో గమనించి నిరోధక చర్యలు అవలంబించక పోతే పైరును మించి పెరిగి పంటకి నష్టం కలిగిస్తుంది, 5. కుతూహలపు చిర చిరలేగాని కోపపు చిరచిరలుగావు, 8. వెడల్పు మూతిగల ఒక చిన్న కుండ, 10. కొన్ని తెలుగు గుణవాచక శబ్దములకు దీనిని చేర్చిన 'కలది', 'కలవాడు' అని అర్థం కలుగును, 11. అనేకులు కలసి చేసే ధర్మకార్యాలలో వంతుల ప్రకారం ఒక్కొక్క-




---

“పూర్తిగా పరమాత్ముని నమ్ముకుని భవిష్యత్తును గురించి చింతపడక ఉండుట ఉత్తమమైన వివేకం.”

రిచ్చేరు ధనము - ఆంధ్ర ద్రావిడ పదము, 13. పువ్వులలో ఎక్కువ రమణీయమైనది గులాబి, 14. సంగీత రాగములలో ఒక ముఖ్యమైన రాగం.

## ఏసదమ్
## పోటీల కూపను
### డిసెంబరు 1985

పలుకుబడి.

8. ధర్మాన్ని సాధించడానికున్న సాధనాలలో మొటమొదటిది.

## తెలివికి పరీక్ష

1. ఈ వరుసలో తరువాత వచ్చే రెండు సంఖ్యలేవి?

37, 30, 29, 22, 21, 14 —?

2. ఒక కిలోమీటరు ఉజ్జాయింపుగా

(ఎ) 10వ వంతు మైలు, (బి) 5/8 వ వంతు మైలు, (సి) 3/4 వ వంతు మైలు, (డి) 2 మైళ్ళు.

3. నేతు 'బండ్' అనే పదానికి పర్యాయంగా ఉత్పన్నమైన పద మేది? దానికి కారణం ఏమిటి?

4. ఈ క్రింది వాటిని తెలుగు పలుకుబడులతో పూరించండి.

(ఎ) పీకి తప్పకుండా ఒకే మాటపై నిలుచున్న వానిని, (బి) ఊరూ, పేరూ తెలుపకుండా పెట్టిన అర్జీలు.

5. లోకులు విషయోపార్జన మందు పెక్కు బాధలను సహించియైనను కించిత్సుఖమును అనుభవింతురు. దీనికి ప్రసిద్ధమైన దృష్టాంత విశేషమేమిటి?

6. దక్షిణ పశ్చిమముల నడిమి దిక్కు ఏ దిక్కు?

7. పాఠము మొదలగువని మనస్సులో నాటునట్లు బాగుగా బోధించుటకు తెలుగు

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి.

1. అసము: కీర్తి (ఎ), దర్పము (బి), ఉత్సాహము (సి), సాటిలేనిది (డి).

2. అలవు: శక్తి (ఎ), సామర్థ్యము (బి), అభ్యాసము (సి), పరిమితి (డి)

3. అలవోక: ఒయ్యారము (ఎ), దైవికముగా (బి), అవలీలగా (సి), కోపము (డి).

4. ఉసురు: ప్రాణము (ఎ), ఆయువు (బి), ప్రోత్సహించు (సి), శూన్యము (డి).

5. ఎసరుపెట్టు: హానికలిగించు (ఎ), వంటకై నీటిని మరుగబెట్టు (బి), ఆశించు (సి), ఆపాదించు (డి).

6. ఏల : ఎందులకు (ఎ), ఏమి ప్రయోజనము (బి), ఒక విధమైన పాట (సి), ప్రభువు (డి).

7. ఉపయమము: కట్టుపాటు (ఎ), వివాహము (బి), మగడు (సి), ఒక అలంకారము (డి).

"కలిమిపై లేమియు, లేమిపై కలిమియు గలుగుచునే యుండును."

## విస్డమ్
### పోటీల కూపను
డిసెంబరు 1985

8. ఉపాలంభము: దెప్పుట (ఎ), నిందించుట (బి), చెప్పదగినది (సి), మరల వచ్చినది (డి).

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 ల ఖరీదు చేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

"దేశంలో దేవాలయాలు మ్యూజియాలుగా మారిపోతే" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ










8 మాటలకు మించకుండా పైన కని పిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

## చైనాలో 3,765 శతాధిక వృద్ధులు

చైనాలో గల 3,765 శతాధిక వృద్ధులలో మూటికి రెండువంతులు స్త్రీలు. ఈ దేశంలో 10,000 లక్షల జనాభాలో మిక్కిలి వృద్ధుని వయస్సు 130 సం. లు.

"మనసు మనసునందె మడచి యాత్మని నాత్మయందె కొందువట్టి యతడు సర్వవిదుడు."

# పోటీలు (ఫలితాలు)

(అక్టోబరు 1985)

**వ్యాసం: విజేతలు:** మొదటిబహుమతి: ఎమ్. ఎస్. సత్యనారాయణమూర్తి, కళింగపట్నం; రెండవ బహుమతి. పి. మోహన్, కోరుకొండ, (విజయనగరం జిల్లా); మూడవ బహుమతి: కె. శిరీకుమార్, కూచిపూడి. (గుంటూరు జిల్లా).

**క్విజ్—జవాబులు:** 1. ఆస్ట్రేలియాకు ఉత్తరముగా జావా దగ్గర (ఇండోనేషియా), 2. ఒంటె, 3. హిరోషిమా, నాగసాకి, 4. సుప్రసిద్ధమైన భారత దేశపు వజ్రం, 5. వాల్ట్‌డిస్నీ, 6. కాశ్మీర్—షేక్ అబ్దుల్లా, 7. కిశోరము, 8. హాలీవుడ్.

**విజేతలు**—మొదటి బహుమతి: బాసని శైలేష్‌కుమార్, హనుమకొండ (వరంగల్ జిల్లా); రెండవ బహుమతి: వి. శ్రీనివాస్, హనుమకొండ, (వరంగల్ జిల్లా); మూడవ బహుమతి: వి. జగదీశ్, వరంగల్.

**పజిల్ - జవాబులు - అడ్డం:** 1. అద్వైత మత స్థాపకుడు. 6. వాద్యము, 7. వస్త్రామనిరి, 8. కుసీదకుని, 9. ముకాము. 11. హరి. 12. పురాణములు, 15, నాస్త, 17. మురిపపు జున్మకాదు.

**నిలువు:** 1. అనువాదకుడు. 2. తతము మదయారి, 3. తక్కువవాని కాపు, 4. పరిమళము, 5. దుపురిరము, 10. కారము, 11. హస్తము, 13. రారాజు, 14, బుద్ధుడు, 16. పాప.

**విజేతలు:** మొదటి బహుమతి: వి. జగదీశ్, వరంగల్: రెండవ బహుమతి: వి. శ్రీనివాస్, హనుమకొండ, (వరంగల్ జిల్లా).

**తెలివికి పరీక్ష:** జవాబులు: 1. (ఎ) తాతాచార్యుల ముద్ర. (బి) ధ్వజమెత్తుట, (సి) తిరుక్షౌరము: 2. (ఎ) అభినందనము, (బి) అభివందనము, (సి) అభివాదనము, 3. గడియారం మరమ్మత్తుకి టైము అయినంత, 4. (ఎ) వర్తమానము, 5. (ఎ)

## 70 శాతం సరస్సులు, నదులు ఎక్కువగా కాలుష్య మవుతున్నాయి

భారతదేశంలో 50 శాతంపైన మట్టి కొట్టుకుపోతూంది. చాలామటుకు భూప్రదేశం ఒరుసుకుపోవడం వల్ల, ఉప్పు చేరడంవల్ల, నీటి నిలువవల్ల, అడవులు కొట్టివేయడం వల్ల నష్టమైపోతూంది. ప్రతి సంవత్సరం 10 లక్షల హెక్టేరులకు పైబడ్డ అడవులను కొట్టేస్తున్నారు. దేశంలో 70 శాతం సరస్సులు, నదులు ఎక్కువగా కాలుష్యం చెందుతున్నాయి.

"మొదలు లోవగ వడ్డి ముట్టుపెట్టు"

సింహాచలము, (బి) ఉరుము, (సి) ఓంగ్ర పెట్టుట, (డి) వకిలించుట, 6. శ్రీకృష్ణుడు అర్జునునికి, అక్క, 7. వగందూరం ఆ తరు వాత దాటి వెళ్ళిపోతారు.

విజేతలు: మూడవ బహుమతి: కుమారి పి. అర్జ తెనాలి.

మాటల మహిమ - జవాబులు: 1. బండి (ఎ); 2. వంపుట (సి), మంకము (డి); 3. త్యాగము (సి); దానము (డి); 4. చివరి అక్షరమునకు ముందు అక్షరము (ఎ), కానుక (బి); 5. ఇండ్లకు నిప్పుపెట్టే వాడు (ఎ), పురికొల్పువాడు (డి); 6. కుటే కుటి పట్టణము (బి), ముంగురులు (సి); 7. మిన్నక (బి), ప్రయత్నము లేక (సి).

విజేతలు మొదటి బహుమతి: వి. జగదీశ్, వరంగల్: రెండవ బహుమతి: వి. శ్రీనివాస్, హనుమకొండ, (వరంగల్ జిల్లా)

ముఖచిత్రవ్యాఖ్య: మొదటిబహుమతి: జి. ఆర్. కె రెడ్డి చినకొదమగుండ్ల (గుంటూరు జిల్లా); రెండవ బహుమతి. కె. కనకదుర్గ, అత్మకూరు, (కర్నూలుజిల్లా), మూడవ బహుమతి: ఏ శ్రీపాద్, హైద్రాబాద్.

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి: బిక్కుమారి రాజేశ్వర్, కోరట్ కర్, (నిర్మల్ తాలూకా); రెండవ బహుమతి: జి. నాగపతి ఉర్లాం, (శ్రీకాకుళం జిల్లా; మూడవ బహుమతి: బి. వి. నర సింహారావు. విశాఖపట్టణం.

పిరికితే-మొదటి బహుమతి: పి. ఎస్. చారి, విశాఖపట్టణం: రెండవ బహుమతి: మద్దిపట్ల రాజశేఖరరావు, అనంతపూర్: మూడవ బహుమతి: టి. బాలకిషన్, లింగ గిరి, (నల్గొండ జిల్లా).

భావపరిచయ పోటీ: మొదటి బహు మతి:కోలపల్లి ఈశ్వరరావు, వెల్లూరు: రెండవ బహుమతి: డి. లక్ష్మణ్, హైద్రాబాద్: మూడవ బహుమతి: బి. ఎస్. ఆర్. అమ్మలు, జేకేపూర్, (ఒరిస్సా).

## మానవుని మెదడులో 17 బిలియన్ల కణాలు



సుమారు 3 పౌండ్లు తూగే మానవుని మెదడులో 15 మొదలు 17 బిలియన్ల మాత్ర కణాలుంటాయి. కొన్ని కొన్ని కణాలు చేరి ఏర్పడిన ఒక్కొక్క గుంపుకి ప్రత్యేక విధులుంటాయి. వాటికి జ్ఞాపకశక్తి, వితర్కం, మదింపు, కోఆర్డినేషన్ వంటి లక్షణాలుంటాయి. మెదడు ఒక టేపు రికార్డరు వంటిది మానవుని మెదడు వెనుక ఈ వివరాలన్నీ సేకరింపబడి ఉంటాయి.

"గొప్పవారి సుగుణాలను మెచ్చుకోవడం లోక కల్యాణ హేతువు."

EDITED AND PUBLISHED BY K. V. GOVINDA RAO
AT No. 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED BY D. SRIDHARA RAO, AT KRANTI PRESS.
2, FRANCIS JOSEPH STREET. MADRAS-600 001 (INDIA)

